

"బ్రహ్మఋషి"

# శ్రీ మొహియద్దీన్ బాద్షా

# శ్రీ చానిబియాంబిక

క. జగమున ధర్మము నెల కొ
ల్పఁగ నీశ్వరుఁ డొక్క దివ్యవ్యక్తినిఁ బంపున్
యుగ యుగమున నాతఁడె యీ
సగుణాత్మకుఁడైన సారసాక్షుఁడు గంటె.



## "బ్రహ్మఋషి" ఉమర్ అలీషా

చ. అణువులయందు సుందర యజాండమునందు హిమాంబు సూక్ష్మపుం
గణములయందు సూర్యశశికాంతులయందు పరాత్పరా భవ
ద్వినుత విలాసవైఖరి ప్రవీణతఁ దోఁచుచు నున్నదింకనిన్
గనుగొన లేనిచో కనులు గల్గిన నంధులుగారె మానవుల్.

# BRAHMARISHI

# DR. UMER ALI SHAH

# TELUGU POET.

"A really great man has ideas always greater than himself." This is more true of Dr. Umer Ali Shah, the immortal poet of the Telugu language, than anyone else. He was born in March 1887 in Pittapuram, a town in the Andhra State of India.

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue, and began writing verse when he was a teenager. The qenius of the boy was at once recognized by Telugu scholars and his fame grew as a poet by the time he was 18.

He wrote plays in Telugu which can only find a parrallel in Shakespeare's. Many Hindu poets and scholars began to pay tribute to this Muslim poet of the Telugu language and regarded him as a itern-poet in the Carlylian sense of the word.

His writings took a new shape in all branches of literature. Besides poetry he wrote novels, plays and essays which excelled the writings of the renowned Telugu scholars of the twentieth century, and so on his works found a permanent place in the annals of Telugu literature.

Today he stands alone like a pole star guiding those who are interested in Telugu literature, and he is acknowledged as their great master who brought a change over literary forms in Telugu.

He also made fresh departures in almost every form of literature. His poetry has no parallel in Telugu, despite the great writers whose works no doubt come nearer to his standard, and yet, lack that charm and cadence, lucidity and masterly style both in narration and criticism.

His vast knowledge of Sanskrit in which language also he was a scholar, contributed effectively towards his prodigious efforts in Telugu. With his contribution Telugu literature would be nowher e as rich as it is today.

What Shakespeare is to the English, what Dante is to the Italians, what Dr. Iqbal is to Urdu speaking Muslims, Dr. Umer Ali Shah is to the Hindus of Andhra.

His writings have no other parallel, as I stated before, in any other literature of the world, because they are the creation of one man. He had to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But alas! It is confined to Andhra, and Andhra only, and its great merit lies hidden outside the state even in India, not to speak of foreign countries.

Yet his reputation, by a curious twist of fate, soared aloft.

In 1936 the International Academy of America confirmed upon him the degree of doctor of literature for his thesis in Telugu. For a man with no university education to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

His was no ordinary intellent, though he knew little English when compared to his ability in Telugu and Sanskrit.

His works in Telugu are clear evidence of what he struggled for, lived for and clied for. He was out and out a nationalist purposed to reform the people around him culturally, socially. economically and politically, and accordingly he rendered youngman service to humanity at large during that little span of his meteoric rise.

He did everything in his capacity. His school of thought pervaded all his works and helped remove the dogmatic ideas and beliefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue.

This won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint His writings spelled the qualities of a great seer.

Though he was a Muslim, the magnanimity of the Hindus could not deprive him of what he was in truth, nor did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gave them the best of the life they needed. And he did not disappoint them.

Dr. Umer Ali Shah was also a social reformer in his own environs. He had reformed the Hindus' customs and manners by dint of his profound knowledge of Sanskrit and the Hindu philosophy which he had mastered.

He knew more than any Hindu scholar of his day. He could recite slokas so fluently and so correctly interpret them in Telugu that the pundits were stunned at his mastery.

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu literature and he came to be regarded as the only eminent poet in modern times in that language.

His writings created a sensation throught Telugu speaking areas both within and outside Andhra State. Indian universities adopted his works in their curricular for degree classes and no library is without his books.

His political career overlapped his literary one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other.

During the last decade of his life his literary fame was at its highest, while his political activities continued till his death.

He had to make many trips every year from south to north to be present in the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935. From then on he used to repair to the hill-tops of Simla to invoke the muse and produce his master-pieces in Telugu literature, even in his political travails.

Apart from his literary activities, his political career was also remarkable. He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound political ideas when he was in Congress upto 1935.

He worked for the nation unhesitatingly during the Khilafat movement and was held in high esteem by all the national leaders of those times. His assembly speeches contained sound principles of integrity and magnanimity and therefore saw the press of his day.

Besides, he worked for the good of the country delivering lectures everywhere irrespective of religion, cast or creed with a

view to promoting goodwill amongst the people, for which he was adored by Muslims and Hindus alike.

When he was preoccupied with political affairs and when his literary fame was at its zenith, he was suddenly shaken by a tragic event. His beloved wife Akbarbebi died at Delhi in April 1935 when he was attending the sessions.

This shock ate into his very vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur.

His body was brought for burial to Pittapuram where every year congregational meetings are held for one week by his 20,000 disciples including eminent poets and scholars of Andhra State in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

—M. N. HUDA





"బ్రహ్మఋషి" శ్రీ హుస్సేన్‌షా

శ్రీ విజ్ఞాన విద్యా పీఠాచార్య

పి ఠా పు ర ము.



భావి పీఠాధిపతి



శ్రీ విజ్ఞాన విద్యా పీఠాశ్రమము,
పి ఠా పు ర ము.



# పీఠిక.

ఈ నాటకము నా ప్రథమ ప్రయత్నముగాదు. తొలుత గీతావతీ పరిణయము, శారికాస్వయంవరము అను రెండు నాటకములు విపులముగా వ్రాసియుంటినికాని యవి కొన్ని కారణములచే బ్రకటింపఁబడలేదు.

ఇది నావయస్సు ఇరువది యేండ్లకులోపున, అనగా 1905 సం॥ ప్రాంతమున 2, 3 మాసములకుఁ బూర్తిగావించితిని. ఈకథ నాస్వకపోలకల్పితమైనదైనను "ఉరుదూ" పౌరాణములయందుఁ గొన్ని పంక్తులుగా వ్రాసిన చిన్న యొకటి రెండు కథలితివృత్తమునం దనుసరింపఁ జేసితిని. ఇది వ్రాయునప్పుడు నాకు మిక్కిలి చిక్కులు దగుల్కొనియుండుటచేత అందందుగల కావ్యదోషములు సవరించుకొనుటకు బొత్తిగాఁ దీరిక లేకపోయినది. అప్పుడు బ్రహ్మశ్రీ నడకుదిటి వీరరాజు పంతులుగారు, బ్రహ్మశ్రీ ఓలేటి పార్వతీశ్వరకవిగారు నాయీపుస్తకమును సవరించిరి. నాలుగవకూర్పు శ్రీ వైష్ణవ ప్రెస్‌నందు నచ్చొత్తించినందుకు నే నెంతయు కృతజ్ఞుడను.

మఱియు మొదటికూర్పునందందందు కొన్ని పొరపాటులు పడినవి. అవికొన్ని దిద్దితినిగాని కొన్ని యింకనుగలవు. ప్రస్తావనమునందు "శ్రీలీలన్ మణిమాల నాటకముగాఁ జెన్నారు నద్దానినుం। రాలీషా కవిచేసెనాంధ్రమున" అనియున్నది. ఇది యేదేనికిని యాంధ్రీకరణముగాని, అనుసరణముగాని కాదు. ఇది కేవల స్వకపోలకల్పిత నాటకము. ముఖపత్రముపై "హిందూస్తానీ కథల ననుసరించి వ్రాయఁబడిన ఆరంకముల నాటకము" అని వ్రాసినదియు పొరపాటే. ఏదోయొక కొన్నిసందర్భములు కథాచమత్కృతి కనుసరించి యుండినను యుండవచ్చును.

ఈ గ్రంథ విరచనమునకై తోలుదొల్త నాకు మిక్కిలి ప్రోత్సాహ మొసంగిన నా బంధుగులును పిఠాపురవాస్తవ్యులును మునీసికందర్ షరీఫ్ గారికి నేననేకవందనము లొనరింపుచున్నాఁడను. రెండవకూర్పు రాజమహేంద్రపుర వాస్తవ్యులును వైశ్యులును నామిత్రసత్తములును నగు శ్రీయుత బైసాని సుబ్బయ్యగారు, కొల్లూరి వెంకటరత్నముగారు, కక్కిరాల శ్రీరాములుగారు మఱియు మూడవదియగు నీకూర్పు శ్రీయుత కొల్లూరి వెంకటరత్నముగారు, మిక్కిలి యాదరణతో ముద్రింపించినందుకు నేనెంతయు గృతజ్ఞుఁడ నగుచున్నాను. పరమేశ్వరుఁడు వీరికైశ్వర్యాయురారోగ్యము లొసంగునుగాక.

నాలుగవకూర్పు శ్రీ విజ్ఞాన విద్యాపీఠమువారిచే ముద్రించ బడినది.

ఇట్లు విధేయుఁడు,

పిఠాపురం

ఉమర్ అలీషా.

# ఇష్టదేవతా ప్రార్థనాదికము.



సీ. అఖిలాంతరంగుఁడై ♦ యాద్యుఁడై సర్వలో,
కంబులు సృష్టింపఁ ♦ గాఁ దలంచి
జీవాణువులఁ గూర్చి ♦ చిత్రప్రపంచలీ,
లల నాట్యమాడించి ♦ ఖలుల మాపి
యుగముల రక్షించు ♦ భగవంతుఁ డేను ప్ర,
వక్తలనంపి నా ♦ వాఙ్మయంబు
శ్రుతియుతంబుగ నిచ్చి ♦ హితమాచరించితి,
నంచుఁ బల్కుచుఁ గను ♦ పించఁబోక
చదువులకు నందరాక సా ♦ జంబుగాక।
తోఁచి తోఁచక యాసచ ♦ రాచరాళి
నిండి నీ నాధ్వనుల్ విను ♦ చుండునాఁడు ।
నైన దేవుండు మాకు ది ♦ క్కగునుగాక!

మ. భగవంతుండ నటంచుఁ జెప్పక మహా ♦ భాష్యంబులన్ వ్రాసి రే
పగలున్ సంఘము సంస్కరించి త్రిజగ ♦ ద్వంద్యంబుగాఁ జేసి యా
దిగువ న్నీడను సోఁకనియ్యని విరా ♦ డ్దివ్యస్వరూపున్ లయం
బగు వేళన్ మముఁ గానఁదోఁచెడు మహా ♦ మ్మన్స్వామి సేవించెదన్.

సీ. అర్థులకొఱకుఁ బ్రా ♦ ణార్థలిడిదుష్ట
కులకాననముకోలఁ ♦ గూలనేసె
కపటాత్ములను దుంచి ♦ ఖలులను ఖండించి,
స్థాపించె రాజ్య మి ♦ స్లామునందు
కల్యాణగుణములు ♦ గలిగి ఖురానను,
వేదంబు ప్రజకుని ♦ వేదపఱచె.
బలుఁడై యమానుష ♦ ప్రజ్ఞావిశేషుఁడై;
రాక్షసవ్యథ మాన్పి ♦ ప్రజలఁ గాచె

నట్టి సిద్దీఖు ఉమరు ఉ ♦ స్మానలీ మ,
హానుభవులఁ దలఁచెద ♦ నహరహంబు.
ఫాతిమాంబా, హసన్ హుసేన్ ♦ పంచతనుల ।
నెంచెదను మహనీయుల ♦ టంచుమదిని.

సీ. వాచామగోచర ♦ వర్తనుఁ డితఁ డనిః
వచియింప నేరికే ♦ వలను గాదో?
నిగమాదివిద్యలు ♦ నీనామహాత్మ్యను,
లెవ్వని నియమింప ♦ నెఱుఁగలేవో?
భువనముల్ సర్వభూ ♦ భువనముల్ వసియింప,
సరిపడ నెవనికిఁ ♦ జాలలేవో?
చంద్రసూర్యులు చాల ♦ శ్రమపడియెవ్వని,
రేపవల్ తిరిగి ద ♦ ర్శింపలేరో
అట్టి తేజోస్వరూప మ ♦ హాత్మ్యగరిమ,
గన్న విజ్ఞానసంఘ సం ♦ స్కూర్త సకల
కలుషపరిహారుఁడై ననా ♦ ఖైలలీషు,
భక్తజనతోడు నిరతంబు ♦ ప్రస్తుతింతు.

సీ. కరవాలమున పాప ♦ చరితంబు నురుమాడి
తనకీర్తి దిశల నిం ♦ చిన ఘనుండు
ఆపదుద్ధారకుం ♦ డై రేపవళ్లు జ,
నోపకారార్థమై ♦ యుండుబలుఁడు
ఉపనిషత్ప్రతిపాది ♦ తోంకారబీటమున్,
దెనిఁగించి కథలు వ్రా ♦ సినవివేకి
మునులతో సంవాద ♦ మొనరించి యాత్మ వి,
ద్యాగరిష్ఠుఁడయి ♦ తనరుబుధుఁడు

శ్రీమదాఖై లిలీగురు ♦ శిష్యుఁడై త ।
దీయపీఠాధికారియై ♦ స్థిర సమస్త
మతగురుండను మా పితా ♦ మహుఁడు నైన ।
శ్రీకనంషావలీని జే ♦ జేయొనర్తు.

సీ. గ్రహచారదుర్వ్యాచా ♦ రము పోయి తల్లి సు,
ఖించి యెవ్వాని గని ♦ కీర్తిఁ గాంచె
మతవిరోధముఁ బరి ♦ మార్చిన తండ్రి హ,
ర్షించి, యెవ్వాని జిరం ♦ జీవిఁ జేసె
త్యాగియై వరమహో ♦ ద్యోగియై ప్రజల రం,
జింప నెవ్వారికీర్తి ♦ చెలఁగుచుండె
నిగమాంతవిద్యచే ♦ నిర్గుణుం డై జగ,
ద్గురుఁడని యెవ్వాఁడు ♦ బిరుదుదాల్చె
నట్టి మొహియుదీన్ బాష్యా మ ♦ హాగురుండు ।
అగతానాగతజ్ఞాని ♦ యార్యధర్మ
విదుఁడు విద్యానవిద్య ప్ర ♦ వీణుఁ డైన ।
మజ్జనకు నెంతునెంతయు ♦ మానసమున

సీ. శ్రీదేవికై వడి ♦ చెలఁగి నిశ్చలమతి,
భర్తనారాధించు ♦ పరమసాధ్వి
పదుగురునోళ్ళలోఁ ♦ బడనిభాంతివోలె,
విజ్ఞాన తేజంబు ♦ వెలయుజనని
పతియాజ్ఞ దాటఁబో ♦ వని భర్గసతివలె,
సమత నందఱఁ జూచు ♦ విమలచరిత
సవతి లేనట్టి భూ ♦ సతిభంగి సతతంబు,
సత్యశాంతాన్విత ♦ సదయహృదయ

కడుప్రచల్లఁగా ముమ్ముల గన్నతల్లి ।
మహితగుణవల్లి ఫాన్నియాం ♦ బామతల్లి
నెల్లకాలంబుఁ దలఁచెద ♦ నుల్లమందు ॥
చల్లని కటాక్షమున నన్ను ♦ సాఁకుకొఱకు

ఆ. వె. చదువుకొన్నవారు ♦ సకలకలాణ్య గు
ణంబులుగలవారు ♦ నన్ను గార
వమునఁ గాంచువారు ♦ బ్రహ్మవిద్యాస్త్రై
వరగుచుండెడు సభ ♦ వారిఁదలఁతు.

ఇట్లు,
**ఉమర్ అలీషా.**



శ్రీ

# మణిమాల

## నాంది

శా. శ్రీకళ్యాణగుణప్రపూర్ణుఁడు మనీ ♦ షినాథసంస్తుత్య లీ
లాకారుం డఖిలాంతరంగుఁ డభవుం ♦ డాద్యప్రభుం డాశ్రితా
నేకభీష్టఫలప్రదుండు త్రిజగ ♦ న్నిర్ణేత నిర్వ్యాపకుం
డేకాకారుఁడు దేవుఁ డెల్లపుడు మీ ♦ కీఁజాలు సౌభాగ్యముల్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూ:- నటీ! నీయవశిష్టకార్యము లీపాటి నిర్వర్తించి యొకసారి యిటురమ్మా!

నటి:- ఆర్యపుత్రా! వచ్చితి నేమి యానుజ్ఞ?

సూ:- ఇంతయాలస్యము చేసితివేమి?

నటి:- భవదాజ్ఞకై వేచియుంటిని. నాకార్య మీసభాసదుల యెదుట నంతగా నేమున్నది?

సూ - నీవు నటివి నీకార్య మెవ్వరి కుండకపోవును. నీ మృదు మధుర కలస్వనంబున నీవసంతమునుగూర్చి పాడి యీపీనులకు నవీనానందముం గూర్పుము!

నటి:- చిత్తము. అట్లే.

ఉ. పాటలు పాడు తేఁటులకుఁ ♦ బద్మమరందము నుగ్గులోసి యా
చోట శుకాంగనాతతికిఁ ♦ జూతఫలంబులు విందుచేసి యా
రాటముతోడ నంచజవ ♦ రాండ్రను దామరపూవుతొట్టెల
న్నిటను నూఁపుఁ జూపులకు ♦ నీటుదలిర్ప వసంతుఁ డెంతయున్.

సూ:- తే. గీ. అహాహా! మనోహరి! నీసుంద ♦ రాంగ మెంతొ
నీసుధామాధురీసమ ♦ న్వితమనోజ్ఞ

గాన మెంతమహానంద ♦ గరిమగాంచు
జాలను గరంచు నమృతవా ♦ రాశి నించు.

నటి – నాథా! మహామహులైన యీసభాసదులిట్లేల గూడి యున్నారు.

:–చ. తెలిదిరో! యీసభాసదులు ♦ వేడుకతో మననాట్యశాల లో
పలి కరుదెంచినారు కడు ♦ భాగ్యము; నేడు మనక్ప్రియంబు వీ
రల కొనఁగూడునట్టు లల ♦ రారెడు నాటక మివ్వ డాడఁగా
వలె మణిమాలలుఁగా గుసుమ ♦ పంక్తులు దేవతలిట్లపైవఁగన్.

నటి:– కోరికల కేమికొదువ? అట్టినవరసపూరితమైన నాటక ...డవలదా?

... కలఁగల యన్ని నాటకము ♦ లీసభవార లెఱింగియుండి మ
మ్ముల దయఁ జూడవచ్చిరి యు ♦ పూర్వ వినోదరసప్రపూర్ణమై
...లయున పీననాటకము ♦ వేడుక నాడుట కెట్లువచ్చు? వీ
...లు ముదమొందు కెట్టులు? భ ♦ రంబగునీపని కెవ్వరో ర్తురా!

:– చెలీ! నీవు ప్రదర్శించెదనన్న చెప్పెదను.

నటి:– భరతపుత్రులు తామే యీకార్యమునకుఁ బూనవల ...ను. ఆయినను సెలవొసంగుఁడు.

:– శా. శ్రీలీలన్ మణిమాల,
...పకముగాఁ ♦ జెన్నారు, వద్దాని నుం
...లీసాకవిచే సె నింపలర;
న ♦ న్యంబైనయా నాటకం
...బాలోచింప రసప్రపూర్ణము
మృదు ♦ వ్యాహారసంయుక్త మీ
వేళన్ సభ్యులఁ దత్ప్రయోగమున
సం ♦ తీతాత్ములన్ జేసెదన్.

నటి:- ఓహో! ఆఁ! మణిమాలనాటకమింత సుప్రసిద్ధగౌరవమైనదా? అది యెవరిచే రచియింపఁబడినదో మఱలఁ జెప్పఁడు?

సూ:- ఉమర్ అలీషాకవిచేత విరచితమైనది.

నటి:- సరిసరి!

చ. ఇరువదియేండ్లు లేవు వుమ ♦ రేయలిషా కవి యెట్టులయ్యె? వి
స్ఫురితవిలాసమంజురస ♦ పూరితవాగమృత ప్రవాహ సం
భరితకవిత్వసత్త్వ మెటు ♦ వచ్చె? నహో! మణిమాలనాటకం
బరయ రచించి నెట్లు చెలు ♦ వా! యెవెపో! కలలోని యేనుఁగుల్.

సూ:- వీరిసాంప్రదాయ మీ వెఱుంగవా?

క. వర మొహియద్దీన్ భాష్యా।
గురువర్యుని జ్యేష్ఠపుత్త్ర ♦ కుఁడు సాధుగుణు
డరయఁగవక్తయు వేదాం।
తరహస్యార్థాత్మవిదుఁడు ♦ దారుఁడు కవితన్.

నటి:- అటులైనఁ బ్రదర్శించుటకు సంపూర్ణ సముత్సుకులము గదా!

సూ:- అవును. సభ్యులును నట్లే యానతిచ్చుచున్నారు.

తే. గీ. మానినీమణి! మాటల ♦ లోనఁ దగిలి।
మనము ప్రకృతకార్యంబును ♦ మరచినాము
లోకసందర్శనోత్సుకుఁ ♦ డై కడంగి।
మన విజయతేజుఁడు గ్రహాళి ♦ మరచినట్లు.

(అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



# ఈనాటమున వచ్చు పాత్రములు.

## పురుషులు.

విజయతేజుడు:— పాంచాల రాజకుమారుడు. మంజువాణి వరించినవాడు.
పాంచాలుడు:— పాంచాలదేశపురాజు, విజయతేజునితండ్రి.
శరద్రథుడు:— సత్యరేఖను వరించినవాడు.
సాత్యవతేయుడు:— మణిమాలప్రియుడు, శరద్రథుని చెలికాడు.
శ్లోకవ్రతుడు:— విదర్భరాజు, మంజువానితండ్రి.
యక్షరాజు:— సత్యరేఖతండ్రి.
దేవేంద్రుడు:— స్వర్గాధిపతి.
అశ్వినీదేవతలు:— దేవవైద్యులు.
బృహస్పతి:— దేవగురువు.

అచ్చటచ్చట సందర్భానుసారముగా విదూషకుడు, విటుడు, భటులు, స్వయంవరమునందలి రాజులు, శ్లోకవ్రతునిమంత్రి, పౌరదత్తుడు, దేవమాత, బైరాగులు మొదలగువారు వత్తురు.

## స్త్రీలు.

సత్యరేఖ:— యక్షరాజుకూతురు, శరద్రథుని ప్రియురాలు.
మణిమాల:— సత్యరేఖ చెలికత్తె, సాత్యవతేయుని ప్రియురాలు.
మంజువాణి:— విదర్భరాజుకూతురు, విజయతేజునిభార్య.
చేటి:— శరద్రథుని యుత్తరముం గొనిపోయినది.
గాంధారి:— సత్యరేఖతల్లి.
చేటిక:— పుష్పలావిక.
కురంగిని:— ఒకపురస్త్రీ.
చెలికత్తెలు.

—0—



శ్రీ

# మణిమాల

ప్రథమాంకము

## రంగము - మహారణ్యము

(విజయతేజుడు బాణహస్తుడై ప్రవేశించును)

విజ — యదార్థ మూహించువారుండరు గదా!

ఉ॥ ఈతఁ డదృష్టజాతకుడ ♦ హీనపరాక్రమశాలి పుణ్య వి
ఖ్యాత చరిత్రుఁడై వెలయు ♦ నైనను షోడశవర్షముల్ మనః
ప్రీతిని గేలమాలె నిడి ♦ పెంపుము భూవర! యంతకున్ గ్రహ
వ్రాతముఁ జూచేనేని మరు ♦ బారికి లోనయి వెళ్ళువాఁడగున్.

అని వచించు జ్యోతిష్కులను విశ్వసించిన మాతండ్రిగారు సూర్య రశ్మిచొరరాని పాతాళగృహంబున నన్ను బంధించిరి. కట్టా! నా తోడి వారవారల కిట్టి యాగర్భకారాగాది దురవస్థలు లేకుండుటచే నన్నుఁ జూచి వారు నిందింపకమానరు. అయినను...గురుని ప్రబోధనాతిరేకం బున నాకుఁ బ్రకృతివిషయంబులన్నియు గన్నులకు గట్టినట్లు లోప్పాచు నియ్యరణ్యంబుం బ్రవేశించినతోడనే యిందలి పదార్థములెల్ల నిత్య మునుఁ జూచువానివలె హృద్గోచరంబులగుచున్నవి. అయ్యో! పురుష లక్షణావ్యతిరిక్తమైన మూషకవ్రతమవలంబించి యీషదవశిష్టము గాఁబడి యాతేఁడుఁబారక కాలముగడపితిని! ఆహా! ఏమి ఈవనరామణీయకము!

సీ॥ జంబీరచారు ర ♦ సాలసాలవిశాల
వనము సభామండ ♦ పంబుగాఁగ
గండక వేదండ ♦ కంఠీరవవ్యాఘ్ర
సారంగములు సభా ♦ సదులుగాఁగ

శారికీరచోర ♦ చంచరీకరథాంగ,
పికఖగావలులు వై ♦ శికులుగాఁగ
వనమయూరంబులు ♦ వారాంగనలుగాఁగ,
తతకుహూధ్వనులు గీ ♦ తములుగాఁగ
వనరమ వివాహమండప ♦ మనఁగ దనరు
నౌర! యీవన మిన్వాసం ♦ తాగమునుఁ
జూడఁ గల్గునె? యెన్నఁడేఁ ♦ జూడఁగలరె
భూబిలంబున నుండుమా ♦ బోఁటివారు.

తే॥ గీ॥ మంజులాకృతిమాధవీ ♦ మల్లి కాదు
లల్లుకొని పుష్పొడులు వెదఁ ♦ జల్లు నచట
వరకపోతంపుమిథునోత్స ♦ వంబుఁ జూడ
దంపతుల యనురాగంపు ♦ సొంపుఁ దెలుపు॥

అజ్జారే! ఈధరాధర మెంతమనోహరము గా నున్నది.

మ॥ శరభవ్యాఘ్రమదేభపంక్తి కిరమై ♦ సంచారి గంధర్వ కి
న్నరమై చారుసగోవర పక్షికరమై ♦ నానామణిప్రోతగ
హ్వరమై పుష్పఫలాభిశోభితల స ♦ ద్వల్లీనగంబై ధరా
థర మేపారెడుఁ బాంధకోటికి ననం ♦ తప్రీతి సంధించుచున్॥

మఱియును,

సమరమునందు నోడిన వి ♦ చారము మాన్పి మృణాళశయ్యలన్
శ్రమముడఁగించుచున్ ఫలవ ♦ నంబుల నిచ్చి గుహావనంబులన్
భ్రమదముఁజూపి కాచునగ ♦ రాజితఁ డేయన రాజపంక్తి నే
మమునఁ గులాభిమాన మది ♦ మానదుగా భువి నెట్టివారికిన్!

(రెండడుగులు నడచి ఆహా! ఏమి యీవనసౌరభ్యము! అంత
కంతకునింపుసొంపారుచు శకుంతకులకలాలాపంబులు మెండై వసంతలక్ష్మీ స్వం

బిలుచుచున్నటులున్నవి. ఇచ్చోటు వదలిపోవుటకూడదు. ఈలవలీలతా నికుంజపుంజంబులచే శోభిల్లు చందనతరుచ్ఛాయనున్న చలువఱాతపైఁ గొంతవడి నిద్రించి నాయరణ్యాగమనజనితా యాసంబును దీర్చుకొనియెదను. (సమీపించి)

తే. గీ. స్ఫటికమాణిక్యవేదికా ♦ స్థలమునందు
జాజిపూసెజ్జలలర విం ♦ జామరలయి
కొమ్మలాకవంక విసర ని ♦ క్కమ్మువనము
వారకాంతాగృహంబుకై ♦ వడి రుచించు.

ఆహా! ఉల్లము చల్లనై యొడలెల్ల ఝల్లు ఝల్లు మనుచున్నది. ! బాణమ! నీవిచ్చటనుండి నన్నుఁ గాపాడుము, (అని నిద్రించును)

(అప్పుడు సత్యరేఖయనునొక యచ్చరకన్నె ప్రవేశించుచున్నది.)

సత్యః- తాను సతియయ్యును, సతుల వినీతలనిసతీజనసంఘాతమున శంతకును దోషమారోపించును. "సౌందర్యకళాలక్షణవంతునింజూచిన నీవుమాత్రముఁయుక్తాయుక్తము లూహించెదవా?" అని నన్నుఁదిరస్కరించి చిన్ననాటిస్నేహమైనఁ దలఁపక నా యనుంగు చెలియగు మణిమాల నన్ను విడనాడి యెక్కడికోపోయినది. ఓ మణిమాలా ! నీవు నన్నెంతగానపహసించినను నీయందునాకుంగల స్నేహానుబంధము మరల నీగిరిగుహావనంబుల వెదకించుచున్నది. ఈ పువ్వుఁ దీవెలయందెందైన దాఁగియుంటివేని వినుము.

ఉ. సారసలోలలోచన శ ♦ శాంకునిఁ జూచి వరించినట్టి యా
తారనుగాను గౌతముని ♦ దారనుగాను విమోహవాక్సుధా
ధారలకేను లోనగుచుఁ ♦ దద్దయు నాదువ్రతంబువీడి యే
పూరుషునైనఁ గోరను న ♦ భోమణిరాలను భూమి వ్రచ్చినన్.

కావున నన్నొక సామాన్యస్త్రీవలె నూహింపకుము. అదిగాక నేను యక్షరాజు కూరిమిపట్టినగు సత్యరేఖనని నీవెఱుంగవా సుకుమార

మూర్తియు సౌందర్యవిజిత మన్మథుండును విశేషించి నాకు మేనత్త కుమారుడునగు శరదిన్ద్రుండు నన్నెంతగా వలచి ప్రార్థించుచున్నను నిరాకరించి బ్రహ్మచర్యవ్రతమవలంభించినను నాకు

చ॥ ధనము కొఱంత లేదు వసు ♦ ధాతల మంతయు నాయధీన మీ
జనులు మదీయమాయ ♦ పెనుజాలంబడి దాఁటలేరు యీ
వన వనజాస్యలెల్లఁ దల ♦ వంతురు నాదుమనోహరాకృతిం
గనిన; జగాన నన్ గెలువఁ ♦ గల్గిన విద్యలు లేవు చూడఁగన్.

ఇంక నెన్ని చెప్పినను కంఠశోషయేగాని కార్యము లేదు మామణిమాల యే జంబూద్వీపములకుం బోయినదో ఇందున్నచోఁ బలుకరింపదా? ఆహా! ఎట్టి స్నేహమెంతలో మాఱిపోయినది!

తే॥గీ॥ చిఱుతకూఁకటినాఁటి నా ♦ చెలిమినైనఁ
దలఁపదయ్యెను; జంతు సం ♦ తతుననొకటఁ
గలిగిన గల్గుఁ గాని యీ ♦ కాలమందు
వనిత గలచోట స్నేహభా ♦ వమ్ము నమ్మ.

ఇంతకు శేషంబవలు మాఱినట్లే మనోవృత్తులు మారుచుండుట సహజము. మా మణిమాల యీమార్గంబుననే పోయియుండును. నేనీ తోవనంటి వింధ్యాచలంబునకుం బోయెద.

(విచార మభినయించి)

ఉ॥ స్వైరవిహారలీల నడఁ ♦ బాసితివో? మణిమాల! లేక నా
వైరముఁ గోరి నన్నిటుల ♦ వంచన సేయఁగ నేగినావొ? యీ
చారుగుహావనంబులును ♦ సారెకుఁ గోరికఁ గూరుచుండు వి
స్ఫారశిలాతలంబులును ♦ జాలినొసంగెడు నీవు లేమిచేన్.

(కొన్నియడుగులు నడచి) ఆహా! నేఁడీవనమొక సఖీనాకృతి వహించి శోభిల్లుచున్నది. (పరికించి)

చ. తొలకరిక్రొమ్మెఱుంగొ? ఘన ♦ తోయదముక్త శశాంకబింబమో?
సలలిత రత్నరాసియొ? వ ♦ సంతుఁడొ లేక జయంతపుత్రుఁడో
వెలయుచునుండె నియ్యెడను ♦ విస్మయమయ్యెడు నద్దిరయ్య! నా
కళవళమీ కలమ్రుచిర ♦ కాంతిని గొంత శమించుఁ గావుతన్.

(దగ్గఱకుంబోయి) ఎండవేడిమికి సహింపనోడి దీనాననుడై యీ చంద్రకాంత శిలావేదికపై సౌందర్యలహరినీనుచు స్మృతితప్పి శయనించియున్న యీ మహాసులక్షణ లక్షితుఁడయిన మహాభాగుండెవ్వఁడై యుండునో? ఆహా! ఈ నవమోహనాంగుడెంతలో నాహృదయము నాచికొనియెను? చంద్రకాంతికిఁ గరఁగు చంద్రకాంతమణింబోలి వైరాగ్యముచే ధృఢమైన నామనస్సు వీని సొగసునఁ గరగి నీరగుచున్నది.

ఉ. ఈ సరసీరుహేక్షణుని ♦ నీమహనీయ సముజ్జ్వలాంగునిన్
ఈసుమనోమనోహరుని ♦ నిందుని భాస్యునిఁ జూచినన్ సము
ల్లాసము గల్గుచుండెను వి ♦ లాసవతుల్ గొని తెచ్చి వీడిరో?
మోసముచేసిరో రిపులు? ♦ మోహినులాత్మహరించి పాఱిరో?

ఇమ్మహానగ పరిసరారణ్యంబుల నొంటిగాఁదోడింతలేక యీతం డెట్లురుదెంచెనో! నామదిఁ బరిశీలించుట కావిధి యీ నవమన్మథునిఁబంపెఁ గాబోలును? పోనిమ్మాతని పంతమే చెల్లుఁగాక! ఇక నామంనబు నిండి వెల్లివిరియుచుండు మోహసాగరంబు నుత్తరింపంజాలుదునా?

మ. గురువుల్ తిట్టిన సత్కులంబు చెడినన్ ♦ క్షోభించినన్ దల్లి యె
వ్వరు దూషించినఁ దోడినెచ్చెలులు ర ♦ వ్వల్ సేసినన్, నా మనో
హరుఁడౌ నీతని బెండ్లియాడెదను స ♦ ప్తార్చిశ్శశిసాధ భా
స్కరులే సాక్షులుగాఁగ; యక్షకులరా ♦ ట్సంజాతనేయైనచోన్.

ఉవిదయై యుదయించిననే సంబరముగాదు. పరస్పరానురాగ కళాకోవిదుఁడైన పురుషరత్న మాకన్యారత్నమునకు లభించినఁగదా ధన్యయగును.

సీ. ఇతఁడు సన్ననురాగ ♦ మతిని దలంచినఁ
బువ్వులఁ బూజింతుఁ ♦ బుడమిసతిని
ఇతఁడు నన్ వరియించి ♦ చతురత నెఱపిన
నారె చీరెల నిత్తు ♦ శౌరిసతికి
ఇతఁడు నన్నుత్తమ ♦ సతిగా గ్రహించిన
బలుల నర్పించెద ♦ భర్గసతికి
ఇతఁడునన్ గాంక్షతో ♦ డుతఁబల్కరించిన
పసపుగుంకుమని త్తుఁ ♦ బలుకుసతికి

జీవితేశ్వర! యనుచు నేఁ ♦ జేరి పిలువ
నగ్గుగా నెంచ కితఁడు న ♦ న్నింపు గులుక
ప్రాణనాయిక! యని పిల్చె ♦ నేని నాదు
జీవములనైన నొసఁగెద ♦ దేవతలకు.

పూరుషాకృతిం గైకొన్న సౌందర్యవారాశియో యనఁ నొప్పారుచున్న యీ మహానుభావుం డప్రయత్నముగా నిచట సంప్రాప్తుండై మోహానలజ్వాలలచే నా మూర్ఖవ్రతమును దహింపఁజేసి పుణ్యముం గట్టుకొనినాఁడు. వీని కే నేమియుఁ బ్రతీకార మొనరింపలేనుగాని నా వననారంభ యౌవనమను ప్రసూనము కానుకగా నిచ్చెదను. (అని గాలింగనము చేయఁబోవును.)

(విదూషకుఁడు ప్రవేశించి) ఆఁ! ఆఁ! ఆఁగుమాఁగుము)

సత్య:- ఎవరిదియో సందడియగుచున్నది! ఓహో! (లేచి నిలువఁబడును.)

విదూ:- పాప మీతనికి దుర్దినములు వచ్చినవి. పదునాల్గేఁడులు భూబిలంబులునున్న యెలుకను ఈ దేవమార్జాలి తన్నుకొని పోఁజూచుచున్నది. అయ్యో! జ్యోతిష్కులమాటలను దిరస్కరించి పెద్దలను దోసిపుచ్చిన వీనికిట్టి ప్రాయశ్చిత్తము కావలసినదే. కాని వెన్నవంటి

నా వజ్రపుగుండె కరఁగి నేయియగుచున్నది. కావుననే నేను సహజ దయారసజ్ఞుఁడను (కొంతయోచించి) ఇంతకు నా హితవచనములు తల కెక్కనవిగావు. సరే! నుదుట వ్రాసినవ్రాఁత కెవరేమి చేయఁగలరు? కానిమ్మామె యెవ్వతెయో తెలిసికొనియెదను. (సమీపించి) అవ్వా! నీవెవ్వతెవు?

సత్యః- (కోపముతో) ముదుసలిని బిలిచినట్లు నన్నావ్వా యను చున్నావు! గ్రుడ్డివాఁడవా యేమి?

విదూః- క్రొత్తగా నంకురించిన కామవికారముచే మతిచలించిన వారికి గ్రుడ్డితనమున్నను నుండవచ్చును. లేక ముందు రావచ్చును.

సత్యః- అదేమి? అట్లనుచున్నావు!

విదూః- అవ్వా యనిన అమ్మా యనుట కాదా?

సత్యః- నీ వికటప్రసంగ మూహించిన విదూషకునివలెనున్నావే?

విదూః- అగును. నీ వన్నట్లు నేను విదూషకుఁడనే. నీవుమాత్రము మాష్యురాలవు.

సత్యః- అదియెట్లు?

వి[illegible]ః- మఱచితివా? ("గురువుల్ తిట్టిన" అను పద్యము చదువును)

సత్యః- (తనలో) ఈతనివలన నేమివిఘాతము వచ్చునో? (ప్రకాశము) అ[illegible]! నన్నిపరుషవాక్యములచే వృథాగా యేల నిందించెదవు?

విదూః- నిన్ను పరుషవాక్యములచేగాదు కఱ్ఱచే నిందింపవలయును

సత్యః- (తనలో) ఈతఁడు బహుభాషి. నేనీ గౌరవముతో నిచ్చోటువదలిపోవుటయే శ్రేయోదాయకము(అనివిజయ తేజు నెత్తుకొని యాకాశమార్గమున నిష్క్రమించును.)

విదూః- అయ్యో! ఈ దయ్యము నా మిత్రు నెగవేసికొని యాకాశమార్గమునం బోవుచుండ నూరక చేతఁగానివాఁడనై చూచు

చున్నాను! ఓ పరోపకారపారీణులారా! సుకుమారుండగు నా మిత్రుని నీ విపత్తునుండి రక్షింపుడు! రక్షింపుడు!

(మణిమాల ప్రవేశించుచున్నది.)

మణి:- అయ్యో! ఇట్లేల తల్లడిల్లెదవు?

విజా:- అమ్మా! నీవీ వనదేవతవో! స్త్రీరూపమును ధరించిన పుణ్యవారాశివో! కాని ఆ మాయాకాంత యెవ్వతెయో నా చెలికాని నాఁచికొనిపోవుచున్నది. చూడుము!

మణి:- (ఆకసమునఁ బరికించి తనలో) ఆఁ! తెలిసినది! సొగసు కాండ్రగు పురుషులంగాంచినంతనే కామినీమణులు యుక్తాయుక్త వివేచనములేక వలచుచుందురని నే చెప్పిన మాటల కాగ్రహించి నా స్నేహమును వదలుకొనిన సత్యరేఖ యిప్పుడు తానేమి చేసినది? ఇఁక దీనిని వంచించుట నా చేతిలోపని. విదర్భాపురికేగి మంజువాణితోఁ జెలిమిఁజేసి నా మనోరథ మీడేర్చుకొందును. (అని నిష్క్రమించును.)

విజా:- ఓహో! వీ రిరువురును తోడుదొంగలే కాఁబోలును. ఇది యేమో నన్నుద్ధరించునని యూసించితిని. ఏమియుం జెప్పకయే పోవుచున్నది. (ముందువంకఁజూచి) అయ్యో! మారాజు తన చిన్నకుమారుని వెదకికొనుచు నీవంకనే వచ్చుచున్నాఁడు పాపమూతనికేమి చెప్పుదును?

(పాంచాలుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పాం:- (దుఃఖముతో)

సీ. పసివాఁడు లోపలఁ ♦ బసలేనివాఁడు నా,
తనయునిఁ గంటిరే ♦ తరువులార!
సొగసుగల్గినవాఁడు ♦ పగలేనివాఁడు నా,
కొమరునిఁగంటిరే ♦ కొలఁకులార!
వెడదకన్నులవాఁడు ♦ విలువైనవాఁడు నా,
పట్టినిగంటిరే ♦ పుట్టలార!

జగ మెఱుంగనివాఁడు ♦ నగుమోమువాఁడు నా,
పుత్త్రునిఁగంటిరే ♦ పులుఁగులార!

అబ్జశంఖరథాంగరే ♦ ఖాంచదమల
చరణసరసీరుహంబుండు భా ♦ స్వద్గుణుండు
రాజకులమౌళి బాంధవాం ♦ భోజహేళిఁ
గంటిరే మీరు గిరిగుహా ♦ గమములార!

హా! కుమారా! విజయతేజా! ఎందుఁ బోయితివిరా? నాయనా! ...ఱికొన్ని గడియలీపాపపుసూర్యున కగపడ కున్నచో నీకీకర్మము లేక ...వునుగదా! ఎంతమూర్ఖుఁడవైతిరా తండ్రీ! నిన్ను కన్నులారఁ జూచు ...ను చుండుటకే నీజన్మమును నోఁచుకొననైతినా? నాగర్భమునకుఁ ...చ్చుంటించి యేతోవ నంటిపోయితివో? నిన్నే రాకాసు లాఁచికొనెనో? ...పురణ్యామృగములు మ్రింగి గుటక వేసినవో? నీ వేదురవస్థలపాలై ...రితపించుచుంటివో? పదునాఱేఁడులైనను నిండుగా నిండని చిఱుతకూన ...వొయ్యా! అరణ్యాగమనశ్రమకుఁ దోడు నిన్ను క్షుత్పిపాస లెంతగాఁ ...డించుచున్నవో! చండకరకిరణంబులకు సహింపనోపక యేభూధరదరీ ...టంబులం బడియుండి చూడ చుట్టము ప్రమొక్కదైవమును లేనిస్థితిలో ...వెంతకళవళ మొందుచుంటివో యని తలఁచితలఁచి నాగుండెలు నీరగు ...న్నవి. నే నింకెట్లు ధైర్యమాఁపుకొనగలను? నాయనా! ఎంతపని ...సితివిరా?

"క. ధరణీధవ! పదునాఱగు
శరములపర్యంతముం బ్ర ♦ చండారిష్టం
బిరవుకొని యుండు నంతకు
ధరను ఖగోళంబుఁ జూడఁ ♦ దగ దీతనికిన్."

అని పూజ్యులైన జ్యోతిష్కులు శాసించినజాతకము శిలాశాస ...ంబుగా నీకట్టెదుట నిల్పితివే? అదియైన నీగమనమున కడ్డుపెట్ట

దయ్యెనా! నీ కీపాడుబుద్ధి యెట్లబ్బినదిరా తండ్రి? ఎన్నెన్నినోములు నోఁచి నిన్నుఁ గాంచితిని? ముద్దులమూఁటగట్టు నీ తేటమాటలు తేనెల సోనలై నావీనుల కికను వినవచ్చు మనేయున్నవి. ఇక నిన్ను నే నెట్లు మఱువఁగలను? నాదుఃఖాగ్ని చల్లార్చు నెవ్వఁడు?

సీ. చిన్నారిపొన్నారి ♦ చిఱుతప్రాయమునందు,
  నగచాట్లఁబడుట నీ ♦ కయ్యెపుత్ర!
  సొంపారు కళలచే ♦ సొగసుమీఱెడునీకు,
  దౌర్భాగ్య మిట్లున్న ♦ దా? కుమార
  అతిసౌకుమార్యసం ♦ గతి వర్ధిలిననీకు,
  వనముల వర్తింప ♦ వలసెఁ దండ్రి
  రారాజగర్భవా ♦ రాశిశీతాంశుఁడ,
  వగువీవు వెతలపా ♦ లైతికుఱ్ఱ
    కటకటా నానుదుట వ్రాసె ♦ నిటులధాత
    వీతదయుఁడై జగాన నీ ♦ వెతకుమనుచు
    ఎన్నఁ డెవ్వారి హింసించి ♦ యున్న పాప
    మో యిటుల కట్టి కుదుపుచు ♦ నున్న దిప్పుడు.

నాజీవితకాలములో పెద్దభాగము నిన్నుఁ గాంచుటకై పరితపించుటకే యైనది. ఇక మిగిలిన వృద్ధజీవనము నిన్నడవుల వెదకుటలోఁ జెల్లిపోవును. నాకీరాజ్యము దుఃఖభోజ్యమైనదిగదా పుత్త్రకా! సమరాంగణమున రక్తముఁ బాఱించి సంపాదించిన దేశము వృథాగా పగతురచేతఁ బడవలసివచ్చెనుగదా హా! నాయనుంగు పుత్త్రకా! నాయనా! నిన్ను నేనెట్లు మఱలఁ జూడఁ గలుగుదునోగదా? కుమార! ఎన్నెన్ని విధములనైనను మఱపు రాకున్నావు? బాబూ! నీవు మాపాపపుగర్భమున నుదయింపక పోయినచో నీకీపాట్లు లేకపోవునేమో? ఏల నీవీ రారాజు గర్భమునె నుద్భవించితివి? నీతోడి పాంచాలపుత్త్రకు లెందఱు

లేరు? వారల కిట్టిదురవస్థలు కని విని యుండలేదే? భూమిలోఁబుట్టినవారు సూర్యునిఁ జూడకుందురా? జగములు వెలిఁగించుసూర్యునిఁ జూడరానంతఘోరపాతకము నీకు గర్భమున నే విధింపఁబడెనా? హా! దైవమా! నాయొక్కఁడైన పుత్త్రకుని బ్రతుకు నీకంటికంతబరువయ్యెనా? పశుపక్షిమృగాదులయందును దయఁజూచు మహాత్ముఁడవే! నీవీ పసిపాపయందేల కృపామతినూహింపవు? హా! హతవిధీ! నీవిధానమలంఘ్యముగదా!

"మ. ధరణీచక్రమనక్రవిక్రమముతో ♦ ధర్మంబుతోఁ గాంక్షతో
వరకళ్యాణకళాలాపములతోఁ ♦ బ్రఖ్యాతవిజ్ఞాన బం
ధురుఁడైఁ శాత్రవకుంభికుంభదళనో ♦ ద్యోగంబునన్ బ్రాజ్యరా
జ్యరమాకాంతను నేలు నీతనయుఁడా ♦ చంద్రార్కవిఖ్యాతుఁడై"

అని వ్రాసిన నీజాతకవిధానమంతయుఁ గేవలము మబద్ధమాయెనుగదా!

విదూ:- హా! మహారాజా! విచారింపకుము. మనము నిర్భాగ్యులమై చెడితిమి. ఎన్నఁడును భూలోకసందర్శనమైనను చేసి యుండని మన చిన్ని యువరాజును మాయలాఁడియగు దేవకామిని తన విమానముపై నిడుకొని తిరోహితమై పోయినది.

పాం:- హా! కుమారా! మాయలాఁడుల చేతులంబడి నీవేమై పోయెదవో? ఇంక నాకు దక్కుట కలలోనివార్త.

విదూ:- రాజా! నీ తనయున కేమియును భయము లేదు. నా వెంట రమ్ము. నీ వరుగవలసినచోటు చూపించెదను. అతఁడిప్పుడే నీ చేతిలోఁ బడును.

పాం - నాయనా! చూపింపుము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

## రంగము - అమరావతీపురమునందలి ఉద్యానవనము.

(చంద్రకాంతశిలపైఁ బరుండిన విజయతేజుఁడును, సత్యరేఖయుఁ
(బ్రవేశించి యుండెను)

సత్య:- భూలోకమునుండి దేవలోకమునకు వచ్చినను మెలకువఁ గాంచనీయని యీ సుందరాకారుని నిద్ర కడు వింత గొలుపుచున్నది! ఆహా! మాయాంధకార మెవ్వరినైనఁ బదభ్రష్టునిం జేయునుగదా. ఇఁక వీనిని లేపి ఆ పూఁబొదచాటునకుంబోయి నిలిచి, ఈతని కాతురత్వాగ మనకారణ మెట్లు సంభవించెనో తెలిసికొనియెదనుగాక! (అట్లుచేయును)

విజ:- (కన్నులు నులుముకొనుచు లేచి) ఆహా! ఎంత నిద్రపట్టినది? భవనమునకంటెఁ దరుచ్ఛాయయే సౌఖ్యదాయకము గదా! గాడ్పులు చల్లార్చి యపరాద్రికిం జేరిన సూర్యుఁ డెంతవింతగాఁ దోఁచు చున్నాఁడు!

సీ. వరుణుండు తనకోట ♦ పై నిడుకొన్నట్టి
కుందనంపుఁబిరంగి ♦ గుండనంగ
కాలనఘూటి సా ♦ గరముపైఁ ద్రిప్పెడు
పగడంపుఁహారతి ♦ పళ్లెమనఁగ
గవలేఁడుకజగ ♦ ద్భవనంబున వసింప
వెలిఁగించుకొనుదీప ♦ కళిక యనఁగ
పశ్చిమకాంతకై ♦ ప్రాక్ప్రతి కానుకఁ
బంపిన కెంపుటుం ♦ బంతియనఁగ

సాంధ్యసమయాంగనాగళ ♦ స్వర్ణకలిత
మాలికామధ్యనాయక ♦ మణి యనంగ
సంజకెంజాయ లీను స ♦ మంజసముగ
బంధురాకృతి నలపద్మ ♦ బాంధవుఁడు.

(శ్రవణ నాభినయించి) ఎక్కడినుండియో వీణాకలస్వనంబులు సుధామధురంబులై మలయానిలుం గూడి పఱతెంచుచున్నవి! నలుగడలం దిగిరిచూచి) ఈ మహారణ్యము వింతవింతలగు సౌధోద్యానములచే నింకొక నవీనశృంగారాకృతి వహించి మనోరంజకముగానున్నది. కాని నానిద్రించిన చోటిది కాదనుకొనియెదను. కాంచనలతా నికుంజపుంజంబులు గల నగసీమ భూమండలంబున నుండునా? ఇవి విశ్వకర్మ నిర్మితకాసారతీరములు. అవిగో! ఘనసారకస్తూరికాపటీర సలిలకణంబులు పూఁబోదలనుండి సహజముగా మంచుబిందువులవలె రాలుచున్నవి. ఆహా! ఇది దేవలోకమే కాకపోయినయెడల గంధగిరిమారుతమున కీసుగంధ మెక్కడిది? ఒక్కటేని భూలోకచిహ్నమిందుఁ గానరాదు. ఇంతదవ్వు నేనెట్లురుదెంచితినో? నన్నెవ్వరిచ్చటికిఁ దోడ్కొని వచ్చిరో అయ్యో! ఇట్టి విపరీత మెందేనియుంగలదే? నిద్రించి మేల్కాంచునంతలో ప్రపంచముల తావులు దప్పునా? లేదు మఱియేమి? పదునాఁలుగేడులు పాతాళగృహంబుననున్న మందబుద్ధినగు నాకీవిచిత్రప్రపంచలీలలు తెలియవుగాఁబోలును నాకంతకంతకు దిగులు లావగుచున్నది. డోలాయమానమానసుండనగు నేనెద్దానిని నిర్ణయింపలేకున్నాను.

సీ. మాణిక్యదీపముల్ ♦ మండుచోటులె గాని,
కలకుటాల్ గలభూమి ♦ గానరాదు
వీణాకలస్వన ♦ గానంబులె గాని,
ఖగమృగార్భాటముల్ ♦ గానరావు
చంద్రశిలాస్నిగ్ధ ♦ సౌధంబులే గాని,
కటికి నేలయుగుహల్ ♦ గానరావు
సౌవర్ణకల్పవృ ♦ క్షవనంబులే గాని,
కంటకావృతతరుల్ ♦ కానరావు

రాజహంసలచే నల ♦ రారుమాన
సవరకాశారములె గాని ♦ శఘరబకవి
కాసకాసారతీరముల్ ♦ గానరావు
అహాహా? యియ్యది యెట్టి పు ♦ ణ్యస్థలంబా!

చ. అకటా! యెచ్చటినుండి యెచ్చటికి న ♦ వ్యంబైనమప్రాపసీ
మకు నే తెంచితి మాయయో!కలయొకో?♦మాంద్యంబో!విభ్రాంతియో
సకలంబైన జగజ్జనాళి కిది సా ♦ జంబో? ననుఙ్ గాన నో
పక యున్నాఁడనొ? దిక్కుమాలిన పశు ♦ ప్రాయుండనై నేనిటన్.

శా. ఏరీతిన్ జనుదెంచినాఁడనొకో? యిం ♦ కేరీతిమత్ప్రాదుకే
లీరమోజ్జ్వలభర్మసౌధవనపా ♦ ళిన్ జూతునో? నల్లవో!
ఘోరారణ్యనటఝ్ఝరీతటములన్ ♦ గోల్పోదునో ప్రాణముల్?
రారే! దీనదయాళులార! యిట లే ♦ రా నన్నుఁ గాపాడఁగన్?

ఉ. భూరవులార! సిద్ధసుర ♦ పన్నగులార! ఖగాళులార! కా
సారములార! జంబువట ♦ సాలరసాలములార! వీరన్మై
లారవులార! పర్వతజ ♦ లాశయతీరములార! మీర లిం
సారఁగ మత్కుటీరనిలయంబునకున్ ♦ జనుత్రోవఁ జూపుఁడీ.

కట్టా! ఎవ్వారలును మాటలాడకున్నారు? పాంచాలదేశాధీశ్వరుఁడగు పాంచాలుని గర్భమునంబుట్టి, విజయతేజుఁడను సార్థకనామమును వహించి, ఎల్ల ప్రజలచే యువరాజుగా గౌరవింపఁబడుచుండఁదగిన నాకు తుద కెట్టిగతి పట్టినది? ఇంక నాకిట నెవ్వరడ్డుపడియెదరు? అయ్యో! పెద్దలైన జ్యోతిష్కులను తిరస్కరించెడుపాపి కెవ్వరడ్డుపడుదురు? అంతకంతకుం జీకటి గ్రమ్ముకొనుచున్నది నా గుండెలు తడఁబడుచున్నవి. తమంతట తామే జాఱుకన్నీళ్లు మఱింత భయప్రదములై యున్నవి. అయ్యో! పొరలిపొరలివచ్చుచుండు నీ దుఃఖమును భరింపఁజాలను. ఆర్తరక్షకుండవగు నోపరమేశ్వరా! రక్షింపుము!

సత్యః- (తనలో) ఈతని వృత్తాంతము సాంతముగాఁ దెలిసినది. కాని వీని భయకంపిత వదనారవిందముం జూచిన నా గుండెలు పగిలి నీరగుచున్నవి. (ప్రకాశముగా)

క. కన్నుల నశ్రులు రాలఁగ
నిన్నఁదనంబున ♦ మొగంబు వెలవెలఁబో నా
సన్నిధి మునిఁగినయటు లీ
వెన్నంగా రాదు నేను ⁿ నిచటనె యుంటిన్.

విజః- మృదుమధురగంభీరకరుణాస్వరముతో నీవెంటనే యుంటి నని భగవంతుఁడు వచించుచున్నాఁడు. ఆహా! నేఁడు నేనెంత ధన్యుఁడను!

ఆ. వె. నాయరణ్యరోద ♦ నం బెవ్వఁ డాలించు
దీనరక్షకుండు ♦ దిక్కునాకు

సత్యః- ఇపుడు దిక్కు నీకు ♦ నింపారుకోమలి
నీదుభార్యయనుచు ♦ నేఁదుకొనుము.

విజః- ఈ వాక్యమున కర్థమేమో? ఓ భగవంతుఁడా! నాకు తోఁచలేదు. నీయాజ్ఞను శిరసావహించుచున్నాను.

సత్యః- (తనలో నా వాక్యములు భగవద్వాక్యములని భావించు చున్నాఁడు. నా మనోభీష్ట మవలీలగా సిద్ధించును. కాని ఇది సంధ్యా సమయము. (పైకిఁ జూచి)

ఉ. అల్లదె! పశ్చిమార్ణవము ♦ నందు నభోమణియ స్తమించె; న
ల్లల్లన నల్లచీరె సమ ♦ యాంగన దాల్చె నన్క దమంబు వ
ర్ధిల్లె; శశాంకుఁ డాయపర ♦ దిక్సతికిన్ పరమార్తికంబు ల
త్యుల్లసనంబునం బనిచె ♦ నో యన నిండె నభంబుఁ దారకల్.

ఇప్పు డాకస్మికముగా నేనీతని కన్నులంబడితినా దేవుఁడని నమ్మిన నే నీతనికి దయ్యము నయ్యెదను. దాన హాని వాటిల్లును. ఇప్పటి కీతనిని

మూర్ఛాగతునింజేసి యీగౌరవముం గాపాడుకొని క్రమముగా మైత్రిని సంపాదించి వలపించెదను.

విజ:- హా! దైవమా! ఎటుఁ బోవుటకును కాలాడ కున్న దే! నన్నిప్పుడును సంకెలలు వైచియే కట్టి పెట్టుచున్నావుగదా! స్వేచ్ఛ యనునది నాకీజన్మమునకు లేదా?

సత్య:- ఇంత తొట్రుపాటుతో కలవరించు నీతనిపై నెట్లు మత్తు మందు చల్లి మూర్ఛాగతునిఁ జేయవలయునో నాకు చేతు లాడకున్నవి. కాని విధిలేక చేయవలసివచ్చినది. (అట్లు చేయుచున్నది.)

విజ:- కన్నులు బరువెక్కి మూర్ఛ వచ్చినట్లంతరంగ మెంతో తల్లడమొందుచున్నది. హా! దైవమా! ఇప్పుడేల నాకడ్డుపడరావు? (మూర్ఛిల్లును.)

సత్య:- నీయనుంగుచెలి యుండఁగా నీకు భయమెందుకు? కళవళ మందకుము. (ప్రక్కం గూర్చుండి)

చ. విరిసరులున్ ధరించి కడు ♦ వేడుకఁ బైఁట యొకింతజార్చి సం
బరమున వక్షమున్ మగని ♦ వక్షముఁ దార్చుచు, గిల్గిలింతలన్
నెఱపుచు, కేళికాగృహము ♦ నిండఁగ సల్లవనంబు లాడుచున్
బరఁగు మనోహరాంగిదియె ♦ భాగ్యము జన్మము జవ్వనంబునున్.

నాకింతటియదృష్టము పట్టునా? ఈతఁడు క్రమముగానిద్రపోవును. నేనింక నింటికిఁబోయి కర్తవ్యమూహించెదగాక.

(నిష్క్రమించును.)





శ్రీ

# మణిమాల

## ద్వితీయాంకము.

### రంగము - విదర్భాపురమునందలి ప్రమదావనము.

(మంజువాణియును, చెలికత్తెయును ప్రవేశింతురు)

చెలి:-(తనలో) మణిమాల వచ్చువఱకు నీమె కీవనవిశేషంబులం జూపుచు దిగులు దీర్పఁ బాటుపడి చూచెదను. (ప్రకాశము) మంజువాణీ ! ఈ వన రామణీయకముం జూచియైన నీ మనంబునంగల విచారము కొంత యుపశమింపఁజేసికొనుము. నీ స్థితి త్రుటికాలములో నెంత విపరీతముగా మాఱినది.

మ. సకులన్ జూడవు కీరశారికలకుఁ ♦ సంగీతముల్ నేర్ప నీ
వొకనాఁడైన విపంచికాస్వరముచే ♦ నోంకారముం బాడ వూ
రక వస్త్రాభరణాళిఁ గైకొని వహో! ♦ రాజత్కరాంభోజ! యి
ట్లొకటా! మోదముఁ దక్కి బేలవయి యు♦ల్లాడంగ నీ కేటికిఁ.

మంజు:- నన్నూరక వేంపుకొని తినకుము. నాప్రాణము లిదివర కే వేఁగియున్నని.

చెలి:- చెలీ! హృదయమున కాహ్లాదముం గల్గించు నీకాంతార సంతానంబులం గాంచియైన నీ సంతాపమును చల్లార్చుకొనుము!

మంజు:- నా సంతాపమునకు శాంతి సర్వేశ్వరుఁడే చేయవలయుం గాని దీనికి వేఱొక శరణ్యము లేదు.

చెలి:- సర్వేశ్వర నిర్మిత పదార్థములందుఁ జూడ నట్టిశక్తి యుండవచ్చును.

మంజు:- అయిన సరే నడువుము.

చెలి:- ఇదిగో! ఈవంక,

(ద్విరదగతిరగడ)

చెలిచూరో కనుంగొనుము ♦ చిత్రమగు నీవనము
సలలితమనోహరర ♦ సాలములు సాలములు
వటకుటజకేతకిల ♦ వంగములు లుంగములు
చటులతరసారహరి ♦ చందనమహీజములు
మాలతులు సేలకులు ♦ మల్లెలును మొల్లలును
చాల విరజాజులును ♦ చంపకసుమంబు లర
విందకురువిందకర ♦ వీరవరసూనములు
నందముగఁ బుష్పొడుల ల ♦ హర్నిశము రాల్చుచును
నలరఁగ మహామదము ♦ నంది శుకదంపతులు
కలరవమనోజ్ఞమృదు ♦ గానములఁ గేరుచును
బాడుచును నాడుచును ♦ బ్రాకుచు నికుంజములఁ
గూడుచుఁ గులాంగనలఁ ♦ గూడుటకు వేఁడుచును
విలసితరతాకలన ♦ వేసటను గాసిలుచు
నిలుచుచు మయూరముల ♦ నృత్యములఁ జూచుచును
కోయిలలు మానిపయిఁ ♦ గూయుచుఁ జిగుళ్లు కడు
మేయుచును గొంతువడి ♦ మ్రింగి మధురస్వరను
ధాలహరు లూరఁగ ని ♦ తాంతముద మందెడినీ;
సోలుచును సొక్కుచును ♦ శోభ లలరారఁగను
బహువిధవినోదములఁ బరపుచు మహావిభవ
మహిమఁ గనఁబరచుచును ♦ మలయగిరిమారుతము
వీవఁగ సరోజములు ♦ విచ్చుచు మరందముల
వావిరి మదాళులకు ♦ పాయన మొసంగెడిని;

దివ్యమణిరత్నముల ♦ దీపములు వెల్గు నిట
భవ్యఘనసారమిటఁ ♦ బండును నిరంతరము
భారతికి పార్వతికి ♦ వనరమకు వాసమిది
చారుమతి! యిచ్చట వి ♦ చారము నశించుఁ జుమి!

మంజు:- చెలీ! ఇవి యేవియును నామదికి సంతోషముఁ గూర్ప లేకున్నవి.

చెలి:- ఈవంకఁ జూడుము! తప్పక సంతోష ముదయింపఁగలదు.

మంజు:- (రెండడుగులు నడచి) సఖీ! ఇదియేమి ?

చెలి:- చూడుము! చూడుము!

(రగడవృత్తము)

కలకల లాడెడు ♦ కమలాకరములు
జలరుహపత్త్రవి ♦ శాలగృహంబులఁ
గలహంసలకుల ♦ కాంతాసంతతి
నిలుచుచుఁ దమశిశు ♦ నివహంబుల లలిఁ
బంకజడోలల ♦ పై నూఁపఁగ నొక
వంకను జోలలు ♦ పాడుచు వెలువడు
నళులు మరందమ ♦ దాంధత్వంబునఁ
జెలఁగుచుఁజిత్రవి ♦ చిత్రస్వరములఁ
బాడుచు నాడుచు ♦ బహుమోదంబునఁ
గూడుచు ముకుళిత ♦ కోకనదంబులఁ
జిక్కుచుసొక్కుచుఁ ♦ జిక్కులఁబడికడు
నక్కరంజెలులే ♦ మనుకొనెదరో ? యని
భీతిని జెందుచుఁ ♦ బ్రియులవిలాసము
చేతము లాఁగఁగ ♦ జిఱఁజిఱఁ బోయెదు;
హరిణార్భకములు ♦ నరిమురిఁ జంగున

నుఱుకుచుఁ దిరుగుచుఁ ♦ నొగిఁ బూఁబొదలను
దాఁగుడుమూతలు ♦ తడఁబడి యాడుచు
వాగుల చెంతను ♦ వరలుచు నున్నవి;
కదళీవిదళ ♦ త్కరిసంఘాతము
వదలక తిరిగెడు ♦ వానరపంక్తులు
శరభమృగాదిక ♦ శార్దూలంబులు
గిరులను వరులను ♦ గేరుచుఁ బాఱెడు
మంజులవాణి! య ♦ మానుషకల్పిత
మంజులవన మిది ♦ మాయురె! చూడుము!

మంజు:— నా కివి యన్నియును మఱింత వేదవాకరములై చూపట్టుచున్నవిగాని నిండారుసంతసముం గూర్ప, జాలకున్నవి.

చెలి:— సఖి! మనంబున నేదియో తీరని విచారముం గల్పించుకొని యూరక దీనవదనవై యుండెద వేల ?

సీ. కల్హారపంకజ ♦ కలితకాసారడో,
లాజలక్రీడఁ దే ♦ లంగవలదె ?
మంజులమాలతీ ♦ మల్లికావల్లుల
నొయ్యారి! యుయ్యేల ♦ లూఁగవలదె ?
కాంచనమల్లికా ♦ కరవీరమాధవీ
కుసుమహారంబులఁ ♦ గూర్పవలెదె ?
చంద్రకాంతశిలల ♦ సైకతసీమల
శయనింప నింపుగాఁ ♦ జనఁగవలదె ?

సారఘనసారమృగమద ♦ చందనాది
పరిమళంబుల మైఁబూసి ♦ తిరుగవలదె!
కనకకంకణఝుణఝుణా ♦ త్కార మొలయ
నింపు సొంపార వీణ వా ♦ యింపవలదె

మంజు:- నా మనంబునం గొండంతవిచారముండఁగా నా కివి యన్నియు నెట్లు రుచింపఁగలవు చెలీ !? నా విషయమై నీవేమియును శ్రమ నొందకుము.

చెలి:- (తనలో) ఓహో! చిక్కేవచ్చినది.

ఆ. వె. చారుకాంచనాంగి ♦ సాధ్వీమతల్లిక
మంజువాణి కిపుడు ♦ మాయదారి
మందు లేనిరోగ ♦ మిందు నేఁ డుదయించె
పర్వతమున నగ్ని ♦ పర్వి నట్లు

(ప్రకాశముగా) చెలీ! మణిమాల యింకను రాలేదు. ఆమెకూడా నీవలనే కొన్నిదినములనుండి విచారముగా నున్నట్లు కనఁబడుచున్నది.

మంజు:- ఏమీ! దేవలోకమునుండి వచ్చి నాతో మైత్రిఁజేసి సర్వదా నా ప్రాణపదమైయుండు మణిమాలకుఁగూడ విచారమా? నాకు కొంచమైనను తెలియనిచ్చినదికాదు.

చెలి:- ఈలోకమున నీతోఁగూడా పుట్టి నీ సహవాసముంజేసి నిన్ను నా ప్రాణపదమైన నెచ్చెలిగా భావించుకొనుచున్న నాకు నీవు మాత్రము రహస్యముం దెలిపితివా? పోనిమ్మా మణిమాలయే నీ గుట్టు బయటఁ బెట్టగలదు.

(మణిమాల ప్రవేశించుచున్నది.)

మణి:- నిర్జరసాంప్రదాయమున నొకమహారాజునకుఁ బుట్టి సత్యరేఖకుఁ బ్రియ స్నేహితురాలనై వివాహ మాడనని ప్రాగల్భ్యములు పలికి, నన్ను నిరసించిన యామెను వంచించుటకుఁ బ్రతిజ్ఞ పట్టి భూలోకమునఁగల యీ మంజువాణి చెలిమి సంపాదించువఱకు నెంతో కష్టమనుభవించితిని. ఇఁక నెన్నాళ్ళీలాగునఁ బ్రవర్తింపవలయునో తోఁచకున్నయది.

తే. గీ. కట్ట! యమితంపు మైత్రిచే ♦ బుట్టినట్టి
పట్టుదల వీడలేక జీ ♦ వనము వనముఁ
జేసి రేయింబవళ్లు ♦ జిజ్ఞాసవలనఁ
జిక్కువంసెను నురిఁ బిట్ట ♦ చిక్కినట్లు.

స్వర్గమునందు సంకల్పమాత్రమున సకల సౌభాగ్యముల ననుభవించు నీ మణిమాల కెట్టి విపత్తు వచ్చినది! ఇంతకు కాలము నతిక్రమింపరాదు.

ఉ. స్వర్గము వీడి భూమి నగ ♦ చాట్లు వహించెడు నాప్రతిజ్ఞ యే
మార్గమునన్ ఫలించునో? ప్ర♦మాదము వచ్చునో? మంజువాణి సం
సర్గముఁ గల్గి యుండుట నసాధ్యము గాదని తోఁచు; గాని యా
దుర్గ యనుగ్రహించి కన ♦ దో? కనునో? మఱి యేమిచేయునో?

ఓ హృదయమా! నీ వెందుకిట్లు పరితాపపడియెదవు? నీ మొదటి సంకల్పమును కొంత స్ఫురణకుఁ దెచ్చికొనుము.

తే. గీ. వసుధఁ బడరాని కష్టముల్ ♦ వడుటకు నోడిఁ
గట్టి యశ్రులు రాల్చనై ♦ కాంతి దూల
వెరువ వచ్చునె? రోటిలో ♦ శిరముఁ బెట్టి
కఱకు రోఁకటి పోటున ♦ కఱచినట్లు.

ఎంత విచారించినను దీనికి మేర లేదుగదా!

ఆ. వె. నుదుటఁ జెడుగు లున్న ♦ నూఱు నోఁచినఁ గాని
కష్టములకె యీడ్చు; ♦ గాలిపడగ
కెంత గాలి యున్న ♦ నెగుర నిచ్చునె పైకి?
త్రాడు క్రింద కీడ్వఁ ♦ దలఁచి నపుడు

(అని కన్నీరు నించుచున్నది.)

మంజు:– ఇదిగో! మా మణిమాల! ఏమోకాని కన్నీరు నించుచు వచ్చుచున్నది. (సమీపించి) చెలీ! ఇదియేమి?

ఉ. అమ్మకచెల్ల! నీ విటుల ♦ యార్తిని జెంది వనాంతసీమలన్
ద్రిమ్మర నేల యమ్మ? నినుఁ ♦ గ్రూరులు పాపములాడెనారె? ని
క్కమ్ము వచింపు! నేఁగటువు ♦ గా నెకసక్కెములాడినానొ? కో
పమునువీడు నాదు చెలి ♦ ప్రాణివినీవు సుమీ తలోదరీ

మణి:– (కన్నీరుఁ దుడిచికొని) చెలీ! మంజువాణీ! నీ మంజులాలాపంబులతో నన్నేల యూరడింపవలయును? నీ దయయున్న నాకు విచారమేల?

మంజు:– నీ కన్నులనీరు నా హృదయమును గరఁగించుచున్నది.

మణి:– కన్నీరుగాదు. ఆనందబాష్పములు.

మంజు:– అట్టియానంద మీవనము కలిగించెనా యేమి?

మణి:– కాదు నీ స్నేహవాత్సల్యములు.

మంజు:– నీవంటి సుగుణధన్య కెవ్వరు విహితులు గాకుండుదురు?

మణి:– నేఁడేమోగాని నీ వదనారవిందము సౌందర్యము చెడి మసి ప్రాఁకినట్లు చిన్నఁబోయి యున్నది. నీలో నేమి విచార మంకురించినది?

మంజు:– నీవు పరిశీలింపలేదుగాని యెప్పుడు నున్నదే.

మణి:– అది యేమో చెప్పఁదగిన దైనయెడల చెప్పుము!

మంజు:– నా తండ్రిగారి సంకల్పమిట్లు బహుదినములనుండి నన్ను వేధించుచున్నది.

మణి:– అంత వేదనాకరమైన కఠోరసంకల్ప మేమైయుండును?

మంజు:– వివాహము చేసెదరఁట! అందుకై స్వయంవరము చాటించి——

మణి:– అట్లయిన నీవు వివాహ మంగీకరింపవా?

మంజు:– నీ యభిమత మేమి?

మణి:– నా కన్నులకు నీవొకవింతమానిసివలె నగపడుచున్నావు.

మంజు:– నాయందుఁ గ్రొత్తగా నీకుఁ దోఁచినవింత యేమున్నది?

మణి:– లేనియనాథత్వముఁ గోరుకొనువారు వింతవారుగాఁ దోఁచరా ?

మంజు:– ఈ యకసెక్కెపుమాటల కేమిగాని యీ విషయమై నీ యభిప్రాయమును బూర్ణముగా వెల్లడింపుము.

మణి:– సకలకలావిశారద వగుశారదవు గదా! నీ వెఱుంగనియర్థ మేమున్నది ?

చ. తగునె వివాహమున్ విడువఁ? దప్పనితోఁచదె ? చాలుచాలు! నీ
జిగినగ వొప్పునెమ్మొగము, చిత్రపటంబున వ్రాయలేని సో
యగము, నవీనయౌవన, మొ యారము, నీసుకుమారసత్కళల్
గగనసుమంబులై యడవిఁ గాచినవెన్నెల గావె కోమలీ!

మంజు:– నీవు సమస్తముఁదెలిసిన మహానుభావురాలవు.నీమాటకు నేనెదురాడరాదుగాని నీ యభిప్రాయ మీ యర్థమునఁ గేవలము గర్హ్యము.

చ. కడు సుకుమారయౌవనవి కాసమన్వితలైన కోమలుల్
జడమతులన్వరించి తమ జాణతనంబును రూపుమాపి యీ
పుడమి నదృష్టహీన లయి పోవుటకంటె మహాతపంబునన్
ఉడవుల నుంట మేలు సుఖ మందఁగవచ్చు మఱొక్కపుట్టునన్.

మణి:– నిన్ను వలపించు వలపుకాఁడు మఱియొకజన్మమునకుఁ గాని యీ జన్మమున లభించువాఁడు కాఁడా యేమి ?

మంజు:– కాకపోవచ్చును.

మణి:– నీ వెఱుంగుదువు కాబోలును ? అవును నివాగతా

నాగతవేదివి ముందెట్టి జన్మమెత్తి యెవ్వని వివాహమాడి సుఖించెదవో కొంచము చెప్పుము ?

మంజు:- నీయెదుటఁ జెప్పుటకు నా కేమియుఁ జేతకాదు.

మణి:- సరే! నీ విపత్రమెన్నినాళ్లు నిలిపెదవు ?

మంజు:- జీవించియున్నాన్నాళ్ళు

మణి:- సఖీ అట్లు కానేరదు. మానసిక పరిణామములు నీవెరుంగవు.

సీ. మాటలందీఁబునే ♦ మన్మథదావాగ్ని ?
ప్రియుని సందర్శన ♦ ప్రీతిఁ గాక
విప్పిన వీడునే ♦ విమలసరోజంబు ?
లనివార్యసూర్యోద ♦ యమునఁ గాక
పిలిచిన వచ్చునే ♦ కలకంఠి మావికై ?
లలితవసంతకా ♦ లమునఁ గాక
రాళ్ళు గరంగునె ♦ రాగముల్ పాడిన ?
చారుసర్వసుధార ♦ సమునఁగాక.

తపసు లైయున్న కర్మముల్ ♦ తరలి పోయి
కట్టి కుడుపక మానునే? ♦ కలుషకలిత
విస్మృతివిద్వేషబుద్ధిని ♦ వృత్తిగాఁ గాక
ఇంకఁ దలపోయు మిభయాన! ♦ యీవిధాన

మంజు:- అవును నీ వన్నదియు వాస్తవమే. నా మనంబిప్పుడేమోగాని వాని వామాడుటయం దెంతమాత్రము నిష్టపడకున్నది. కావున నీవా విషయమునకుఁ దోడ్పాటు కావలయును.

మణి:- నీ మాధ్యమును వీడకున్నవే? నీకేమి వెర్రి? ఇంత మాత్రము ప్రపంచజ్ఞానము వలదా ?

తే. గీ. పరిణయంబొల్ల కుండిన ♦ పలు తెఱంగు
లూహ సేయక యీ జగ ♦ మూరకున్నె ?
కావ్యమును కన్యకను గాంచి ♦ ఖలు లొకింత
వంక దొరకిన వంచింత్రు ♦ జంకు లేక.

మంజు:— నీకిష్టములేనికార్యము నేను చేయుట కూడదు. చేసెద నన్నను నీవు పడనీయవు. కావున నా యుదంతమంతయు విని, నీస్వాంత మున నొక్కింత యాలోచింపుము.

మణి:— ఆవశ్యము చెప్పుము.

మంజు:— నా కిప్పుడు కూరిమిమీఱు పురుషవతంసము సమకూ డుట కడు దుర్లభము. అట్లు కూడనిచో నేమూర్ఖునినైన వరింపవల యును. ఈ చిత్తక్షోభముకంటె సుఖముగా నూరకుండుటయే శ్రేయ స్కరమని తలంచితిని.

మణి:— నెచ్చెలీ! ఇదియా నీ సందేహము ? నా చెలిమివలనం బ్రయోజనము నీ కీడైన పురుష శ్రేష్ఠుని సమకూర్చుటయేయై యుం డఁగా నీవు క్షోభించు టెందులకు ? ధైర్య మవలంభించుము.

మంజు:— నీవట్టిభారము వహించి తోడుపడెదనన్న నింతకంటె భాగ్యమున్నదా ? నీ యాజ్ఞ నేను శిరసావహించుచున్నాను.

చ. సరసుఁడు, విజ్ఞుఁ డార్యజన ♦ సమ్మతసచ్చరితుండు, మారసుం
దరుఁడు, వినూత్న యౌవనుఁ డు ♦ దారమహాబలశాలి, శీలి, బం
ధురతరకీర్తి, సాధుగుణ ♦ ధుర్యుఁడు, ధైర్య కళావిలాసి యౌ
వరుఁడు లభించుటే వలచి ♦ వచ్చినభాగ్యము కోమలాంగికిన్!

మణి:— (తనలో) ఈమె కిట్టివానిం బెండ్లియాడవలయునని యున్నది కాఁబోలును! (ప్రకాశము) నీ జనకుని యాజ్ఞఁ దిరస్కరింపక నావచ్చుపర్యంతము వగపుమాని యింటనే వసియింపుము. నీ స్వయం వరమునకు ముందే వచ్చెదను.

మంజు:- నీవు లేక నే నొంటిగ నెట్లునిలువఁగలను ?

మణి:- భూపాలకశిరోమణులయందు నీవు వరింపఁదగినవాని నన్వేషించి సత్వరము వచ్చెదను. అంతవరకు ధైర్యము దెచ్చికొని యెట్లో కాలముం గడుపుచుండుము. ఇప్పుడు నీ వింటికిం జనుము.

మంజు:- చెలీ! మణిమాలా! కార్యాంతరవ్యాసంగంబున నన్ను మరచెదవుసుమీ! కార్యసిద్ధిం బడసి వేగముగా రావలయును. నేను గృహంబున కేగి నీ యాగమనమున కెదురుచూచుచుండెదను. సెలవిమ్ము.

మణి:- మంచిది.

(మంజువాణియు, చెలియును నిష్క్రమింతురు.)

మణి:- నాకంటె సుందరులు లేరుగావున నన్ను వలపించువారు లేరను గర్వముతో మిట్టిపడుచుండు సత్యరేఖవంటిదికూడాఁ తాను స్వయముగా మోహించిన మోహనాంగుఁడగు విజయతేజుఁడు మంజువాణి నవశ్యముం దనియింపఁగలడు. ఆతఁడు గుణగరిష్ఠుఁడనిగూడా విని యున్నాను. కావున నే నిప్పు డమరావతికిం బోయి వీరిరువురికిం బరస్పర మోహావేశముం గల్పించుటకు నా యమానుషశక్తిఁ బ్రయోగింపవలయును. దానంజేసి సత్యరేఖయందు నాకుఁగల క్రోధము పూర్తిగాఁ దీఱుటయేగాక సత్యరేఖను వరించి యామెచే నిరాకరింపఁబడిన శరదగ్ధుని కోరికయు నెరవేఱును. భగవంతుఁడు నాకు సహాయుఁ డగుఁగాక! రాగమా! నీవు వర్ధిల్లుము.

(అని నిష్క్రమించును.)

## రంగము—అంతఃపుర ప్రాంతము.

(సత్యరేఖపై విరహముతో శరదగ్ధుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శర:- ఆహా! నా ప్రయత్నము లన్నియు నిరర్థకములైనవి! ఇఁక నాకు సత్యరేఖ లభించు యోగము లేదు. కట్టా! ఈ వియోగభార మెన్నాళ్లిట్లు సహింపవలయును ?

తే. గీ. విరహదావాగ్నిఁ బడి నిరం ♦ తరము "సత్య
రేఖ! సత్యరేఖా! సత్య ♦ రేఖ!" యనుచు
పొగులుచుండెద నీ రాక ♦ పోదలుదాఁక;
వానకుఁ దపించుచాతక ♦ పక్షి పగిది.

పొగచూరినదానిపై గాలి విసరునట్లు తూర్పుకొండపైఁ బాంధులపాలిటి దోషాకరుం డుదయించి నన్ను మఱింత విసివించుచున్నాఁడు అదిగో!

చ. చలువమెఱుంగులన్ జగముఁ ♦ జల్లనఁ జేయఁగనోపి తామసీ
లలనకుఁ గర్ణభూషణ వి ♦ లాససుమాకృతిఁ జూపి, యొప్పుగా
కలువల నిద్రమాపి, రతిఁ ♦ గాంతలకున్ బ్రమదంబు రేఁపి, యా
వల వలరాజు లేపి, నెల ♦ వచ్చెనదే! విరహుల్ తపింపఁగన్.

ఓ నిశాకర! నన్నేల బాధించెదవు?

చ. ఉదధిని బుట్టినాఁడవు స ♦ హోదరి యిల్లు వారింప; విద్యలన్
పడఁపడి నేర్వఁబోయి గురు ♦ భార్యను గూడిన పాతకంబునన్
వదలెనె చూడు మాఱుపది ♦ వ్రక్కలు సేయక? సిగ్గులేక న
న్నిదిరికలంపఁ బోకు నిను ♦ నిర్జరు లాంచికొనన్ సుధాకరా!

జౌరా! తన మేనమామం దోడుచేసికొని యీ దర్పకుండుకూడ నన్నుఁ గారించుచున్నాఁడు! ఇతనికిఁ దగినట్లు బుద్ధిచెప్పెదను.

ఉ. హా! మదనా! ప్రతాపసద ♦ నా! నవపుష్పమరందమత్తమా
యామఘుఁపాళిఁ గూడి మల ♦ యానిలుతో సహవాసివై సదా
కామ! ప్రసూనబాణములఁ ♦ గ్రాంచెద వేటికి? తండ్రి బుద్ధి నీ
కేమి లభింపలేదె? మది ♦ నింత కపర్ధిని దల్చుకొమ్మిఁకన్.

(స్పర్శము నభినయించి) అబ్బా! ఈ మహాబలుండును వీరికిం కిసిపోవుటలేదు.

చ. స్మరశరవారముల్ దగిలి ♦ మాడి కడుం బొగచూరుమేనిపైఁ
గరుణ యొకింత సేయక సు ♦ గంధసరోజరజోవిలాసివై
విరు లనునింధనంబు లిడి ♦ వీచెద చేటికి? గంధవాహా!
సరి దొరన? ఫణీశ్వరునిసన్నిధి కేగుము సాహసంబునన్! నీ

అదిగో! నా సఖుఁడు సాత్యవతేయుఁడు వచ్చుచున్నాఁడు.

(సాత్యవతేయుఁడు ప్రవేశించును.)

శర:- మిత్రుఁడా! ఇటఁ గూర్చుండుము.

సా:- శరద్రథా! ఎంతసేపటినుండి నీ విచ్చట నుంటివి?

శర:- కొంతసేపైనది.

సా:- ఇక్కడ నేమిచేయుచుంటివి?

శర:- సత్యరేఖపై నాకుంగల యనురాగ మీవెఱింగిన దేగదా? ఆమె నన్నెంతయుం దృణీకరించినది.

సా:- నీవలెనే నేనును మణిమాలం గామించితిని. ఆమె నన్నుఁ దృణీకరించెనని తలంపను. కాని అంతగా మనసిచ్చి మాటలాడుటలేదు. ఈ నడుమ నామె నా కన్నుల కగపడుటయే లేదు.

శర:- సత్యరేఖ నసత్యరేఖం జేసెదనని పంతముపట్టి మణిమాల యెక్కడికో చనియెనని తెలియవచ్చినది. అది నా మనోరథ సిద్ధికిం గొంత తోడుపడుఁ గలదని యూహించి యున్నాను. నే నీ జన్మమున సత్యరేఖం బెండ్లియాడఁ గలనా?

సా:- నారీరత్నమగు సత్యరేఖ సౌందర్యవారాశియగు నీకుఁదగిన యిల్లాలు.

శర:- అయిన నేమి? ఆమె దురదృష్టవంతుఁడ నగునాకు లభియించినదికాదు.

సా:- అట్లుకాదు. నీ ప్రయత్నము సరియయినది కాకపోవుటచే నామె నీ కల వడినదికాదు.

శర:— ప్రయత్నము లన్నియుం జాలించికొంటిని. ఇఁక నీవేమైన కృతిచేని చేయుట కభ్యంతరము లేదు.

సా:— నీ చిత్రమును, నొక జాబును వ్రాసి ప్రౌఢయగు దాసి చేతికిచ్చి పంపించుము.

శర:— సరే అట్లుచేసెదను. నా చిత్రపట మంపుట కామె నన్నెఱుంగదా!

సా:— నీవామెకు మేనత్త కుమారుఁడవని నేనెఱుంగుదును అయినను పంపించము. నాకావల పనియున్నది. మఱల వచ్చెదను.

శర:— వెళ్ళుము.

సా:— (తనలో) నేను నా మణిమాల యెందేగినదో తెలిసికొని, కామె నన్ననుగ్రహించువెర వూహించుకొనెదనె.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

శర:— చేటికా!

(చేటి ప్రవేశించుచున్నది.)

శర:— (చూచి) సమయమున కరుదెంచితివి!

చే:— నా కార్య మిప్పు డంతగా నేమున్నది?

శర:— చేయువా రుండినఁ గార్యము లుండవా?

చే:— సత్యరేఖ నీకు దక్కదు నన్నాపని కంపకుము. నేను వెళ్ళను వెళ్ళనను కాదు.

శర:— చేటీ! మొదటనే యమంగళము లాడకుము.

చే:— నీ వేమనుకొనినను నే నచ్చటికి వెళ్ళను.

శర:— అన్నిసంగతులు నెఱింగియున్న నీవట్లు తృణీకరింపరాదు.

చే:— అట్లయిన నీ సందేశమేమో చెప్పుము.

శర:— ఈ యుత్తరము సత్యరేఖ కందఁజేయవలయును.

చే:- ఏదీ! యుత్తరము?

శర:- చేతికిచ్చును.

చే:- నేను చదువవచ్చునా?

సర:- నీవద్ద దాఁపరిక మేమున్నది? సాంగముగాఁ జూడుము.

చే:- (విప్పి తనలో) ఇట్టి యుత్తరము లిదివఱ కెన్నియైనవి? (ప్రకాశము)

సీ. శ్రీలీల సౌభాగ్య ♦ శీల సారసలోల
లోచన నిజరేఖ ♦ చూచు లేఖ
కరయుగంబులు మోడ్చి ♦ శిరము నేలకువంచి
విన్నవించెడిప్రేమ ♦ విన్నపములు
చిన్నతనమునుండి ♦ నిన్నదాఁకను నున్న
స్నేహానుబంధ మే ♦ చిచ్చునంటె?
పరుషోక్తులాడని ♦ పరమసాధ్విని నన్ను
నిరసించి పరులను ♦ నెమకఁదగునె?

పలికి తప్పని సుగుణాల ♦ వాలవు గద!
నాటి దోఁటలో మాటయే ♦ నీటఁ గలిపి
తకట! మర్యాద గాదు న ♦ న్నరసికొనుము
రమణిరో!;——

విధేయుఁడు,
శరదృథుఁడు వ్రాలు.

పై విలాసము వ్రాసితివా?

శర:- చూడుము!

చే:- (మఱలఁ జదువుట నభినయించి)

తే. గీ. ఇందులో సంగతుల చూడ ♦ నందువేని
యుక్తతరంబైన విప్పము ♦ చిత్తగించి
విరహదావాగ్నిఁ దెలుపున ♦ క్రూరములైన
నీ మనంబును గరఁగించు ♦ నేమొ బాల!

సఖి. ఈ ప్రయత్నపూర్వకమైన వ్రాఁత శ్లాఘాపాత్రముగానే యున్నది. నేఁజెప్పవలసిన సంగతు లేమైనా నున్నవా?

శర:- ఇట్లు చెప్పవలయును.

చే:- ఎట్లు?

శర:- ప్రసన్నచిత్తవై వినుము.

సీ. సుందర వదనార ♦ విందంబునకుఁ
జెక్కుటద్దంబులకుఁ బ్రేమ ♦ ముద్దులనుము!
చింతకాఁకటినాఁటి ♦ స్నేహంబు విడనాడి
యడియాసపెట్టుట ♦ న్యాయమనుము!
కులమువారమువావి ♦ గలవార మదిగాక
మామకుమారుని ♦ మఱవకనుము!
బద్ధానురాగుఁడై ♦ పరిపరివిధముల
బ్రతిమాలుటకు నన్నుఁ బనిపె ననుము!

నిన్ను వలచిపెక్కు ♦ నిజదేవతల మ్రొక్కు
లిడుచుఁ బ్రతిదినంబు ♦ గడుపు ననుము
పరుల వాంఛ సేయ ♦ సరిగాదు నీ కయి
బ్రతుకు నన్నుఁజూడ ♦ వలయు ననుము.

చే:- ఇదే ప్రకారము వచించెదను.

శర:- చేటికా! ఇంకొక సంగతి మరచినాను.

చే:- మరచుటెందుకు? చెప్పుము చెప్పెదను.

శర:- ముందే యిట్లనవలయును.

తే. గీ. చెలియరో! విను నా ముద్దు ♦ చెలువ కడకు
జాబుఁ గొనిపోయి ముందె జ ♦ వాబు నడుగు
మట్టు లియ్యక బ్రతిమాలి ♦ యడిగనేని
యువిద! నినుఁ గోరునతఁ డిట్లె ♦ యుండె ననుము.

చే:- అట్లే చెప్పెదను.

శర:- తప్పక చెప్పి యొప్పింపవలయును.

చే:- నాచేతనైనంతవఱకు శక్తివంచన లేకుండఁ బ్రయత్నించెదను. ఆవల నీ ప్రాప్తము.

శర:- అందుకు దైవము తోడ్పడుగాత.

చే:- మఱేసంగతులును లేవు గదా!

శర:- లేవు. నీవు వేగముగాఁ బోయిరమ్ము.

(చేటి పోవుచున్నది.)

శర:- సాత్యవతేయుం డింకను రాలేదు. నే నాతనిం గలిసికొని యీ యుదంతమంతయు వివరించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

---

## రంగము—అమరావతీపురసౌధోద్యానము

(విజయతేజుఁడు పరుండియుండఁగా సత్యరేఖ ప్రవేశించును.)

సత్య:- విజయతేజా! లెమ్ము. తెల్లవాఱుచున్నది. నాకీ దినము శుభగంభీరమైనది. నీ మొగముచూచి నమస్కరించుచున్నదానను ఆ పరమేశ్వరుఁడు నీ హృదయమున ననురాగబీజము నాటునుగాక. రాజా లెమ్ము.

సీ. రేయెల్ల వెన్నెలఁ ♦ గాయుచు వరుణాద్రిఁ
జనుదెంచి నిలిచిన ♦ చంద్రుఁ డదిగో!
పతి యింట లేనట్టి ♦ పడఁతుల విరహాగ్ని
జ్వలియించి చాలించు ♦ మదనుఁ డదిగో!
పాంథసందేహంబుఁ ♦ బాసి చీఁకటిదోలి
నిక్కి వెల్వడువేగు ♦ చుక్క యదిగో!
కామునికుసుమహార ♦ గంధసంకలితమై
వణకించు చల్లని ♦ పవన మదిగో!

పద్మముకుళంబు వెలువడి ♦ పడఁతికొఱకు
వెదకుచుఁ బరిభ్రమించెడు ♦ భృంగ మదిగో
మేలుకో! నాథ! నిద్రించు ♦ వేళగాదు
విమలముఖజితద్విజరాజ! ♦ విజయ తేజ!

చ. విరివిలుకాని కేళి నలి ♦ వేణులఁ మేనుల దోఁచుఘర్మముల్
విడుచుచు వాయువుల్ కుసుమ ♦ సౌరభముల్ వెదచల్లెడిన్ నిశా
కరుఁడటు మాసె, దీపముల ♦ కాంతివొరంగెను, దిక్కులేగె, రా
తిరి చనె, తెల్లవార, రతిఁ ♦ దేరనిబాలల గుండె ఝల్లనెన్.

అరుణోదయం బగుచున్నది ఇతనిని లేపెదను. (అట్లు చేయును.)

విజ:– (లేచి కన్నులు నులుపుకొనుచు) ఓ! దైవమా! ఆర్త రక్షకా! నిర్జీవమై రేయెల్లఁ బడియున్న యీ కట్టైకు ప్రాణము పోసి మరల లేవనెత్తితివా? ఏకాకినై యిట్లు రాత్రింబవళ్లు గడపుచుంటినే కాని నా కిందెవ్వరును గానవచ్చుటలేదు. వలయు భోజ్యపదార్థము లెవ్వరో యిందు బెట్టి పోవుచున్నారు. నన్నిచటి కెవ్వరు తెచ్చిరో యిట్లు విచారించుచున్న నన్నుఁ గాంచుచు సంతోషించుటవలన వారి కేమిలాభమో నా కించుకయును బోధపడకున్నది. (లేచి తూర్పుదిక్కునకుఁ దిరిగి) అదిగో!

తే. గీ. ప్రాక్సతీమణి పవడంపు ♦ బల్లెమనఁగ
కాలపురుషుఁడు వాయించు ♦ గంటయనఁగ
పద్మినీకన్య నోముల ♦ పంటయనఁగ
సూర్యుఁడుదయించె జగములు ♦ శోభఁ గాంచె.

నాల్గుజాము లఖిలదిగంతముల వెన్నెలం బఱపి చీఁకటి తెగువ నడంచి యస్తగిరి కేతెంచి నిలిచిన చంద్రుఁడు రాత్రితో నంతరించెను గాని నా విపదంధకారమున కెన్ని రాత్రులకైనఁ బరిసమాప్తి లేదయ్యెను. అయ్యయో! నా కింక శరణంబు లేదుగదా!

సత్యా:- (తనలో) ఇన్నిదినములనుండి యీతనిని మాయలందోసి యలమంచి నందులకు నాకుఁ జాల విచారముగా నున్నది. ఇక జాగు చేయక పూవులఁ గోయు నెపంబున నీతని కన్నులం బడెదను.

విజ:- (సత్యారేఖం జూచి) ఎవ్వతెయో యొకమదగజయాన నా కొక మార్గప్రదర్శకురాలివలె మెల్ల మెల్లగా నడుగులలో నడుగులు వైచికొనుచు నొక్కింతసేపు నడుమనడుమ నేమేమో యూహించుచు, పువ్వులు గోయుచుఁ జనుదెంచుచున్నది ఆహా! ఏమి యీ ఠీవి.

మ. వరభాస్వజ్జఘనంబుతోఁ గురులతోఁ ♦ బాలిండ్లు తూఁగాడ సుం
దరలోలాక్షులతో నొయార మెసఁగన్ ♦ ధమ్మిల్లమున్ వీడ నిం
పురుచింపన్ దనుఁ జూడఁ బయ్యెదపటం ♦ బున్ జాఱ మోహాకృతిన్
దరుణీరత్నము వచ్చుచున్నది వియ ♦ త్పౌదామనిన్ బోలుచున్.

యీ సౌధోద్యాన మీమె దేయై యుండవచ్చును. లేక విహారార్థ మీ దేవకన్య విచ్చలవిడి నిందుఁ దిరుగ వచ్చినదా! ఈమె వైఖరిం జూచిన నిచ్చోటునకుఁ గ్రొత్తగా వచ్చిన నావలె లేదు. దగ్గరకుంబోయి యడిగి తెలిసికొనియెదను. ఇప్పటి సతులతో మాటలాడుట కూడనో కూడదో! అయినను సాహసింపక తీరదు (దగ్గరకుం బోయి)

ఉ. ఎవ్వతె నీవు ? పంకజద ♦ ళేక్షణ! యెచ్చటనుండి వచ్చితో
జవ్వని ? నిండు ప్రేమ కొన ♦ సాగ దయన్ వచియింప మింతగా
నివ్వనమందు నుండెద వ ♦ దేటికి ? నావలె దుర్దినంబులన్
నివ్వటిలంగ బెంగఁ గొనిఁ ♦ నిల్చిన తీరువఁ దోఁచె నీయెడన్.

సత్యా:- (తనఁలో) ఈతఁడు నన్నేమియుం గుఱుతుపట్టలేదు! నే నట్లే దరించెదను. (తేఱిచూచి పయ్యెద సడలించుకొనుచుఁ గోపముతో)

ఉ. ఎవ్వతెనైన నేమి? తెరు ♦ వెయ్యది నీ? కటు బొమ్మి యొంటిగా
నివ్వనవాసమున్ సలుపు ♦ నింతులతోడ భయంబు దక్కి నీ
జవ్వన మేర్పడంగ నెర ♦ జాణతనంబునఁ బల్కరించె దీ
వెవ్వఁడ? వోరి! మా సఖులు ♦ నే మనువారిట నిన్నుఁ గాంచిన ?

విజ:- ఎవ్వరేమన్నను ప్రార్థించుచున్న నాకు నీ సంగతి చెప్పిన ముప్పు వాటిల్లునా ?

సత్యా:- నీ విచ్చటి కరుదెంచుటయే ముప్పు.

విజ:- నా యంతట నేను రాలేదు. నేనెట్లు వచ్చితినో యెఱుంగను.

సత్యా:- నాతో మాటలాడుటయైన నెఱుంగుదువా?

విజ:- ఎఱుఁగుదునో మానుదునో! నా యవివేకమును మన్నించి, ఇది యెవ్వరిచోటో నీ వెవ్వతెవో యెఱింగించి మా నివాసమునకుం ద్రోవ చూపి పుణ్యముం గట్టుకొనుము.

సత్యా:- సరే నీ దీనాలాపములు మాకును నీ యుదంతమును వినవలయునని తొందింపఁ జేయుచున్నవి.

సీ. కడలిబుట్టిన సుధా ♦ కరుఁడు దుగ్ధాంబోధి
యశ నాంబువులు మాకు ♦ నార్యవర్య!

సంగీతసాహిత్య ♦ శాస్త్రప్రసంగముల్
భూషణంబులు మాకు పుణ్యచరిత!
జంబూనదీతటాం ♦ చలనాకవీథులు
స్థావరంబులు మాకు ♦ సదయ హృదయ!
నలినాస్త్రకుముదబాం ♦ ధనవసంతాదులు
కులదైవములు మాకు ♦ కోమలాంగ!

సిరి సరస్వతి శర్వాణి ♦ చెలులు మాకు
స్వర్గకైలాసములు నాట్య ♦ సభలు మాకు
గరిడి దీరిన రంభాది ♦ గణిక లెల్ల
మమ్ముఁ గొలిచి చరింతు రో ♦ మాన్యచరిత!

విజ:- (తనలో) ఈమె అచ్చరకన్యయని స్పష్టపడినది. నన్నిట కేల గొని తెచ్చినదో? (ప్రకాశముగా) కాంతా! ఈ పట్టణము పేరేమి? నీవెవ్వ తెవు?

సత్య:- ఇదిగో! చూడుము!

సీ. జంభారి వేడ్కతో ♦ సఖులతోఁ గ్రీడించు
నంచారభూములా ♦ స్ఫాటికములు
భారతీసతి వీణ ♦ వాయించుచును సదా
పాడెడుచోటు లా ♦ పసిండిగట్లు
గగనచారులు నాట ♦ కము లాడుకొనుచును
విహరించుమనికి యా ♦ వేశ్మపంక్తి
రాజహంసలతోడ ♦ రాజిల్లుమానస
కాసారతీరమా ♦ కమలవనము

కామధేనువు, కల్పవ ♦ ల్లీ మతల్లి
వెలయు పుణ్యప్రదేశ మా ♦ విమలవనము

కను మనంతంబు సిరులకుఁ ♦ గాఁపురంబు
దివికి దాఁపురం బనురావ ♦ తీపురంబు.

విజ:- (తనలో) నా పురాకృతసుకృతంబునం గదా భూలోక దేవ లోకంబులం జూడఁగలిగితిని. నేఁటితోఁ బదునాలేఁడులు భూబిలంబున నివసించిన కొఱఁత నిశ్శేషమైనది. ఇఁక నా తోడివారలలో నేనే ధన్యతముఁడను.

సత్యా:- ఇంకను విచిత్రములం జూపెదను. చూచెదవా?

విజ:- ఇంతటితోఁ జాలును. కటాక్షించి నా యింటికింబోవు త్రోవఁ జూపుము.

సత్యా:- ఈ స్నిగ్ధశశాంకశిలాతపంబులచే నతిరమణీయంబగు సువర్ణఖచిత సౌధోద్యానమే నీ యిల్లు. నిన్ను నేను చెలువుఁడవని పరిగ్రహించుటచే నీయందుఁ గటాక్షించుట. ఇదే నీకుఁ జూపెడు త్రోవ.

విజ:- (చెవుల మూసికొని) కటకటా! ఇది యేటి యవనీతి! లాఁతిచెలు లిట్లనఁ జెల్లునా!

సత్యా:- నేను లాఁతి చెలిని గాను.

విజ:- మఱెవ్వతెవు?

సత్యా:- నిన్ను వరించి దేవనగరంబునకుం గొనితెచ్చిన కన్యను.

విజ:- (తనలో) ఇక్కడి కన్ని సంశయములును తీఱినవి. ఈ మాయలమారి దేవతయే నన్నిట్టిపాట్లం బెట్టుచున్నది. (ప్రకాశము) ఓ దయావతీ! ఆలస్యము చేయక నన్ననుగ్రహింపుము పోయివచ్చెదను.

సత్యా:- నిన్నుఁ బరిగ్రహించుటయే యనుగ్రహించుట.

విజ:- దివిజాంగన వగు నీవట్లనుట చెల్లునా?

సత్యా:- నామాట లసత్యములు గావు. త్రికరణశుద్ధిగా నిన్నే వరించితిని నా ధన మానః ప్రాణముల నీకు ధారవోసితి నింక నీదే నా భారము.

విజ:- చిక్కులులేని దారి జూపుము పోయెదను.

సత్య:- వలదు. నీ విందుండక తీరదు.

విజ:- నా జననీజనకులకన్న నీవధికురాలవుగావు.

మ. నవమాసంబులు మోచి కాంచి యభిమా♦నంబొప్పఁ బాలిచ్చి యీ
భువిలోఁ బెంచినతల్లి యెంతొ అలునో? ♦ పోషించి రక్షించి నా
యవియా ముద్దులఁ జూడ నున్న జనకుం ♦ డయ్యారె! యెట్లేడ్చునో?
నవలా! యోచినజేసి చూడ వలదా ♦ న్యాయంబు జింతింపుచున్.

సత్య:- అగును. యొడిలోనున్నప్పుడు తల్లి గాని యొడివీడినవానికి పడతియే శరణ్యము, లేకున్న వాని జీవన మరణ్యము గావున.

ఉ. బాలుఁడ! వెఱ్ఱివాఁడవు ది ♦ వాకరరశ్మి యెఱుంగ నట్టిపా
తాళగృహంబునం బెరుఁగు ♦ తావకమూషకనింద్యబుద్ధి యిం
కేల త్యజింపవో? కుమతి! ♦ యేటికిఁ దల్లి, నిజాలయంబుబు; జా
తీలవలీల తాంతముల ♦ తీవల తావులనుండఁ జెల్లదే.

అదియునుం గాక,

ఉ. కౌఁగిట వద్ది, ముద్దిడి, వి ♦ కాసమృదూక్తుల మేలమాడుచున్
రాగముతోడఁ గోర్కులల ♦ రారఁగఁ దళ్కుకురుల్ కరంబునన్
బాగుగఁ గీలుకొల్పి; బహు ♦ భంగులఁ గుల్కి చరింపు మింక రా
భోగము లేలరా? యమర ♦ భోగ మలభ్యము నీకుఁ దక్కఁగన్ ?

విజ:- అట్లుకాదు.

చ. అతివల పొందు ముందుఁ గడు ♦ హాని; యొయారికళావిలాసముల్
చతురతరప్రసంగములఁ ♦ సంగతితోఁ బడఁదోసియుఁ బూరుష
ప్రతతిని; భిల్లభామిని నె ♦ పంబునఁ బక్షులఁ గూల్చినట్టు; లీ
గతిని దలంప కెట్టిగుణ ♦ గణ్యులుఁ గూలి కృశింప లే దొకో,

సత్యా:- ఓహో! ఇదియా?

క. ఈరీతి నీతులాడెడు వారలె మద
నాగ్నిఁ గూలు ♦ వారలు సతులఁ
గోరనివారలుందురె యీ
శ్రీరంగపు నీతులెన్ని ♦ జెప్పిన జదురే.

విజ:- ఊరక లేనిపోని మాటలతో నన్నేల యాయా

చ. తరుణులఁ గోరి వారిచెడు ♦ తంత్రములం బడి ఖేదమోద
గరమున భిన్నులై పనుల ♦ కై వడి రేఁబవ లొక్కరీతి వ
ష్కరవిషయంబులం జెడుట ♦ కంటె గృహంబుఁ బరిత్య
హ్వారములనుంట మేలదియు ♦ పాపము లంటని చోటు

సత్యా:- (పరిహాసముగా)

ఉ. ఏటికి నిట్టిమాటల న ♦ నేకము వింటిమి; యిట్టివారలే
బోటులపాలి భృత్యులయి ♦ పోయిరి; నీవన నెంత? మును
రాటవినుండు తాపసులు ♦ వ్యాసపరాశర కౌశికుల్ నిరా
ఘాటముగాఁ బయిం బడెడు ♦ కాంతలఁ గూడక త్రోయఁ

విజ:- అగునుగాక.

మ. యతిచూడామణు లంగనామణులతో ♦ నత్యంత కేళీసము
న్నతి వర్తించిన మాట వారికి సమా ♦ నత్వం బదెట్లాను?
సతికిన్ స్వర్గవధూటికిన్ సమతయే? ♦ చర్చింప మానిందు
యతివా! పుణ్యమతుల్ జగద్గురువుల ♦ శాంతప్రశంసాత్మక

అది కాక ఆయతులైన నతివల యువినీతికి వివేకము ఝున వారనియేగదా నిందింపఁబడుచున్నారు. గావున

వ. జిలిబిలి మేలిపాటల వి ♦ చిత్రవచోరచనానుకూల కో
మలతర చేష్టితంబులను ♦ మంజువిలాసములం గరంచి యు

జ్జ్వాలకుచపాళి పైఁట కఱ ♦ చాటున దాఁగుడుమూఁత లాడ"న
వ్వూలు పచరించుచుం బురుష ♦ పుంగవులం గికురింతు రంగనల్

సత్య:- కఠినహృదయుండ వగు నిన్నెంత ప్రార్థించినను నీకు జాలి కలుగకున్నది.

ఉ. చంద్రమతిన్ వరించి నృప ♦ చంద్రుఁడు కౌశికు మాయచే హరి
శ్చంద్రుఁడు ధన్యకీర్తి గన ♦ జాలెను ద్రౌపదిఁ గూడి పాండవుల్
సాంద్రయశస్కులైరి; నలున ♦ లప్రభుఁ డాదమయంతిఁ జేరి యా
చంద్రయశోంబునందె నిల ♦ సారసలోచనలన్న నల్పులే.

విజ:- ఉండిన నుండెదరు గాక! వారందఱును భూలోకసతులు నీవు దేవ కామినివి.

సత్య:- నీవు నిజమైన యుత్తమ క్షత్రియ సంజాతుఁడ వైతివేని నీ కిది క్షాత్రముగాఁ దోఁచెనా ? అబలయగు నొక కన్యాజనరత్నమెంత ప్రార్థించినను చెడచెవింబెట్టి మరుబారికి నురిపెట్ట నుంకించుచున్నావు. ఈ నా మనఃక్షోభ మూరకే పోవునా ? నా దీనాలాపములువిన్న నల్ల రాళ్లయినఁ గరఁగుచున్నవిగాని నీ వజ్రకఠినమైన గుండెకు జాలియైనఁ గలిగింపలేకపోయినవి. ఓ ప్రేమా! నీ వేమైపోయితివి ? ఏకపక్షావలంబనము నీకు దగదు.

విజ:- అగును. నా మనవి చెల్లింపుము.

ఉ. మాటలు చేతకాలమును ♦ మాపక నా పితరుల్ నసించు న
చ్చోటికిఁ బంపు మొ్రక్కెదను ♦ సొంపులు నింపు నిలింపకాంత! నీ
బూటకం నుడుల్ విడుము ♦ పుణ్యము నీ కగు; నొంటిఁ బోవ నె
ప్పాటను గల్గు ? నెట్లిటకు ♦ వచ్చితినో యెఱుగన్ దలోదరీ!

సత్య:- ఓ కఠినహృదయా! నా సామవాక్యము లంతకంతకు నీకు బరిహాసాస్పదములగుచున్నవా? సరే! నిన్నుఁ గారాగృహాబద్ధునిం జేసి

...లెన్ని విపత్తులం బొనలించి నా కసిఁ దీర్చికొనెదను. అప్పుడైన ...కొనియెదవు.

(తెరలో)

...సైరవిహారులార! దివి ♦ సారసలోచనలార! గానవా ...ఘురీణలార! యెట ♦ నుండిరి? రండు! శచీవరుండు కా ...రసమీపసౌరభిక ♦ శాలను నాటక మాడఁ బిల్చె నిం ...రఁగ పారితోషికము ♦ లందగవచ్చు విలాస మేర్పడన్

సత్యా:— (ఆకర్ణించి) ఏమీ! జంభాది సౌరభికశాలను నాటక ...డఁబిల్చెనా? విజయతేజా! నీ యదృష్టమున కారాగృహమున్నది. ...రమ్ము.

విజ:— (వెంటపోవును)

తే. గీ. ఎచటఁ బుట్టినాడ ♦ నెచటకే తెంచితి
నీమె యెవతెయుందు ♦ నేమిగతియొ
తెలియరాదు; సూర్యు ♦ డలపూర్వదిశఁబుట్టి
పశ్చిమాద్రిఁ గ్రుంక ♦ వలసినట్లు

(తెరబడును)





శ్రీ

# మ ణి మా ల

## తృతీయాంకము.

### రంగము—మహారణ్యము.

(మునివేషియగు శరదర్థుఁడు విచారముతోఁ బ్రవేశించును.)

శర:- నా మిత్రుఁడగు సాత్యవతేయుని యుపదేశమున నా చిత్రపటమును లేఖయును నా ప్రియురాలగు సత్యరేఖయొద్ద కంపితినిగాని, ఆమెచూచి చించి పాఱవైచి పైఁగా నసహ్యమునుగూడ వెలిబెట్టిన దఁట! ఇఁక నేనెట్లామెను బరిగ్రహింపఁగలను? నా కోరిక లెట్లీడేరును? నాకు బ్రతుకుతెరు వెయ్యది? ఓ భగవంతుఁడా! ఎట్లైన నాకా సత్యరేఖను లభింపఁ జేయుము.

తే. గీ. పూలఁ బూజింతు మన్నను ♦ పాలుపడరు
వలచు వల దన్నవారిని ♦ వలచు చుంద్రు
బాగురే! కాములల యను ♦ రాగమునకు
రీతి లే దెందుఁ గలికాల ♦ నీతి పగిది.

(కొమ్మ లల్లాడుటం జూచి) అదిగో! సత్యరేఖ వచ్చుచున్నది. నా జడదారి వేషమును చక్కఁగా సమర్థింపవలయును. (అట్లుచేసి) అయ్యో! ఇంకను రాలేదు. లత లల్లాడుటచే భ్రమించితిని. "నీవు తపసి వేషమును ధరించి యీ వనమున నుండుము. ఏదో నొకమిషఁ గల్పించి సత్యరేఖను నీ యొద్దకుఁ బంపెదను." అని చెప్పి కృతజ్ఞురాలైన దాసి వెళ్ళి చాలసేపైనది. కాని, ఇంకను సత్యరేఖ నసుపలేదు? ఏమైన విఘ్నములు రాలేదుకదా ?

సత్య:- (ప్రవేశించి) ఈ యుద్యానవనమం దిదివరకెన్నఁడును చూడని యతివరుఁడు వచ్చి నివసించి యున్నాఁడని తెలిసినది. విజయ తేజుఁడు నాపై మరులుకొను ప్రతిక్రియ నూహించి మందియ్యఁగలఁ డేమో ప్రార్థించెదను. (అని శరద్రుధుని వంకకు వచ్చుచున్నది.)

శర:- (చూచి) సత్యరేఖ నిజముగానే వచ్చినది. నా కపటసన్యా సము కామ వికారముచే నిర్వహింపఁగలనో లేదో? ఓహో! మా సత్య రేఖ నేడెంత యొయ్యారముగావచ్చినది. నేనామెను నిజముగా గుర్తింప లేకున్నాను.

సత్య:- అదిగో! యతివరుఁ డచ్చట నేమేమో జపించుచుఁ దిరుగు చున్నాఁడు. శూన్యహస్తములతో మహానుభావుల సందర్శింపరాదు. కొన్ని విరులం గోసికొని పోయెదను.

తే. గీ. విరులమాలికఁ గూర్చిమా ♦ విజయతేజు
మెడను వేసెడుభాగ్య మెం ♦ న్నఁడు లభించు?
చెప్పరే! తరులార! రా ♦ చిలుకలార!
కరుణ దాంపత్య మెటులైనఁ ♦ గలుపరయ్య!

(అని పువ్వులఁ గోయుచున్నది.)

శర:- (ముందువంకఁ జూచి) ఇది నిజముగా మా బంగారుబొమ్మ యేనా! ఇది సత్యరేఖయేనా?

తే. గీ. ఘనఘనాఘనవల్లికా ♦ కాంతి యేమొ?
జలధి వెడలిన సంపూర్ణ ♦ చంద్రకళయొ?
ఖచరకిన్నర యక్షరా ♦ ట్కన్యయేమొ?
స్మరసతీమణి యేమొ యీ ♦ సరసిజాక్షి.

ఆహా!

తే. గీ. కురులు వ్రేలాడఁ దన పైఁట ♦ కొంగు జాఱ
నడుము కుచభారమున నూఁగ ♦ నడరి దేహ

కాంతి లతకాంతిఁ దిలకింపఁ ♦ గళ రహింప
నదిగో! చను చుండె గజయాన ♦ యతిభయాన

సత్యా:- (మెల్లఁగా నడచుచు తనలో) ఈ యోగి పలుకరించునో పలుకరింపఁడో ?

శర:- (చూచి తనలో) ఓహో! ఇది మా సత్యరేఖయే. ఎంత త్వరగా మరచిపోయినది ? దగ్గరకుం బోయి యేదో మిష పెట్టి పలుకరించెదను.

సత్యా:- (సమీపించి) యతీశ్వరా! నమస్కారము. (అని పువ్వులు కాళ్లపై జల్లుచున్నది)

శర:- కల్యాణమస్తు.

మ. అలినీలాలక! నిండుజవ్వనము సొం ♦ పారఁ వనీవీథులఁ
జెలువొప్పఁ విహరించు నీ వెవతెవో? ♦ చిత్రంబు! తో డింతలే
క లతాంతంబులఁ గోయుచో ఖలులు కాం ♦ క్షల్ సేయరే? చేసి ర
న్న లలిఁ హానిగదా! కులాంగనలకుఁ ♦ న్యాయంబె యీమార్గముల్

సత్యా:- నేను విహారార్థమై రాలేదు. భవదీయ దర్శనార్థమైవచ్చియుంటిని. ఇచ్చట నివసించు యక్షరాజున కనుంగుతనయనగు సత్యరేఖను.

శర:- నావలన నీకేమి ప్రయోజనము? ఎందుకొఱకు వచ్చితివి ?

సత్యా:- నా యపరాధమును మన్నించినచో మనవి చేసెదను.

శర:- మేము సర్వసంగపరిత్యాగులమగు యోగులము. అందఱిని సముద్ధరించుటయే మా కార్యము. కావున భయంబు మాని నీవు దేని నడుగఁదలఁచుకొంటివో నిస్సంశయముగా నడుగవచ్చును.

సత్యా:- ఆర్యా! నా వరుఁడు నా యం దనురాగము విడిచి నన్ననుగ్రహింపకున్నాఁడు. వానికి నాయందు ప్రేమ జనియించునట్లు మందుగాని రక్షగాని యొసంగి కృతార్థజేయుము.

శర:- (తనలో) హా! దైవమా ఈమె యెవరినో వరించినట్లున్నది. తానిట్లు బుద్ధి చెప్పి మఱలించెదను. (ప్రకాశముగా) వెఱ్ఱిదానా! ఆ రెడ్డిని వరుసేల వరింపవలయును? నీయందనురాగి యగువానినే నాదకొనుము.

సత్య:- ఆ సంగతి నేనెఱుఁగుదును. అట్లయిన మీ మందు లపేక్షించువారెవ్వరు ?

శర:- నీకు నేను హితోపదేశము చేసితిని. నీ కది యిష్టములేక పోయిన పోవుఁగాక! తుదకు మాత్రము చింతించెదవు.

సత్య:- స్వామిట్టి యమంగళము లాడవలదు. నా యందు దయ గలదేని నే నడిగిన మందు దయసేయుఁడు. లేదా పొమ్మనుఁడు.

శర:- (తనలో) ఈమె నేమిషచేనైన నాచికొనవలెను. లేనిచో మఱి లభించుట దుస్సాధ్యము. (ప్రకాశముగా) సరే, నీ యభిప్రాయము నట్లు చేసెదను. మా యాశ్రమసరోవర తీరమునకు నీ కనువైనయెడల నా తోడ రమ్ము అందుహించి పసరొకటి నీ కిచ్చెదను.

సత్య:- స్వామీ! ఇఁక లేనిదేమి? మీ రెచ్చటకు రమ్మనిన నచ్చటికే వచ్చెదను. అంధుఁ డేమికోరును? రెండు కన్నులు గాదా!

శర:- మంచిది రమ్ము.

(అని యిరువురును నిష్క్రమింతురు.)

## రంగము—దేవలోకము.

(కారాగృహములో విజయతేజుఁడు విచారముతో నుండును.)

విజ:- అబ్బా! ఎంతలో నెన్నెన్ని విచిత్రములు చూడఁబడు చున్నవి! ఓ చిత్తమా! కారాగృహబంధనంబునకు విచారింపకుము. ఎట్లు కానున్నదో యట్లు కాక మానదుగదా!

మ. సముఁడై కర్మలకంటియంటక నిజే ♦ చ్ఛాచారుఁడై యీ ప్రపం
చము వెల్గింపఁగ సూర్యచంద్రులకు సం ♦ చారంబు గల్పించి, యిం
త మహత్త్వంబు నెఱుంగనీఁడు కఖిలాం ♦ తర్యామియై యుత్తమో
త్తముఁడై వెల్గెడు నట్టిదేవుఁడు నన్ను ♦ దాటించు దుఃఖాంబుధిన్.

ఆజన్మపాతాళగృహనిబద్ధుండనై నేఁటికి బంధముక్తుడనై తినని సంతోషించుచుండఁగా భగవంతుఁడీ సత్యరేఖారుపమున నన్నీ బందిగ మునలోఁ ద్రోసి పరితపింపఁజేయుచున్నాఁడు ఆహా! పురాకృతదుష్కర్మము కట్టి కుడుపక పోవదుగదా!

తే. గీ. భువిని జెఱసాల తప్పిన ♦ దివిని దప్ప
దయ్యె; నిర్భాగ్యునకు నిందు ♦ నందు నొకటె!
వనము భవనమైన నొకటి ♦ స్వర్గమేగి
నను వడేకులు దప్పన ♦ న్నది నిజంబు.

గడియగడియకును మాఱుచుండు నా యవస్థఁజూచిన నాకే వింత యగుచున్నది. ఆహా! కాలచక్రమా! నీ మహాత్మ్య మేమనవచ్చును? ఎంతలో నన్నెట్లు మార్చితివి! ఇంకను నీ కసి దీరలేదా? నీకు నే నాచరించిన యుపకృతి యెుండినఁ గృపామతిని మరవఁగూడదా? నీ దురాగ్రహాగ్ని హోత్రమునకు నన్నొక కట్టెం జేసితివా?

సీ. స్వరసుధాసంగీత ♦ సంగతి వోయి యీ
దోమలపాటలో ♦ ద్రోల్లవలసె
వీణాకలశ్రుతి ♦ విధములు వోయి యీ
చిమ్మటరొదలలోఁ ♦ జేరవలసె
చందనకర్పూర ♦ సౌరభంబులు వోయి
గబ్బిలంబులగబ్బుఁ ♦ గాంచవలసె
వైదుషీవిలసిత ♦ వ్యాసంగములు వోయి
విటనటాలాపముల్ ♦ వినఁగవలసె

విమలకలమాన్న రుచ్యభ ♦ క్ష్యములు వోయి
పూఁటభత్యంబుఁ గటకటా! ♦ పుల్ల వెలుఁగు
నకట! సారకాయదొప్ప నీ ♦ రానవలసె
వలసినన్ని కష్టంబులు ♦ పడఁగవలసె

అయ్యో! మాయమ్మను దలంచుకొనిన నా గుండెలు వ్రక్కలగు చున్నవి.

ఉ. ముద్దులుమూఁటగట్టు తన ♦ పుత్త్రుని రేపటినుండిఁ గానమిం
దద్దయు భీతచిత్తమునఁ ♦ దల్లి దిశల్ పరికించి దీనతన్
బెద్దయెలుంగు రాలుపడఁ ♦ బిల్చుచు నేడ్చుచు నంగలార్చుచుం
ఎద్దినచించునో? యకట! ♦ యే మన నేర్తును దైవమాయకుం.

సముద్రాంతరములవలెఁ బొరలిపొరలి వచ్చు నీ దుఃఖము నాఁపుకొనుట నా తరముగాదు. ఇట్టి సమయమున నన్ను రక్షించువారెవ్వరు?

(మణిమాల ప్రవేశించుచున్నది.)

మణి:- (ప్రవేశించి (తనలో) వీనితో మాటలాడుట కిది మంచి సమయము (సమీపించి ప్రకాశముగా) రాజా! నమస్కారము.

విజ:- (తనలో) అయ్యో! సత్యరేఖ మరల వచ్చినది. (పరీక్షించి) కాదు. మఱియొక రాక్షసి! (ప్రకాశముగా) ఓ కాంతమణీ! నీవెవ్వరి దానవు?

మణి:- ఆర్యా! నేను భూలోకనివాసినినగు మణిమాలను. మంజువాణి చెలికత్తెను.

విజ:- మంజువాణీ యెవరు? నీ రాకకుఁ గతం బేమి?

మణి:- మంజువాణి శ్లోకవ్రతభూపాలుని కుమార్తె. ఆమె పంపుటచే నేనిచ్చటి కరుదెంచితిని.

విజ:- మాతో మీ మంజువాణి కేమి పని?

మణి:- ఆమె మీ కులకాంతగదా!

విజ:- పరపురుషులతో స్త్రీల కేమిపని ?

మణి:- ఆమె యొక రాజకన్య నీవు రాజకుమారుఁడవు. ఆమె స్త్రీరత్నము. నీవు పురుషరత్నమవు. సౌందర్యాది లక్షణములయందు మీరిరువురు నీడుదీడులు. కావున, అన్యోన్యానురాగ సహాయతతో తమంతట తామే కలుగుట సహజము.

విజ:- ఆమె నాకేమి సాయము చేయఁగలదు ?

మణి:- నీవుసత్యరేఖచే నపహరింపఁబడితివని విని తనవద్దకు నిన్నుఁదీసికొని రమ్మని నన్నంపినది. అవల మీరిరువు రేమేమి సాహాయ్యములు చేసికొనఁగలుగుదురో నేఁజెప్పలేను.

విజ:- (తనలో) ఈ బందిగము విడిపించి భూలోకమునకుఁదోవ చూపినదే చాలును.

(ప్రకాశముగా) నాకెట్లీ బందిగమునుండి విముక్తి కాఁగలదు ? నీతో వచ్చుటెట్లు సంభవించును ?

మణి:- నిన్ను భూలోకమునకుఁ దోడ్కొని పోనెంచి వచ్చిన నాకీ కారాగృహ మడ్డుపెట్టునా ? ఈ దేవకాంత లడ్డువచ్చెదరా ?

విజ:- (తనలో) ఈమెం జూచిన నసాధారణ ప్రజ్ఞాధురీణ యని తోఁచుచున్నది. కాకున్న నిచ్చోటికి మనుష్యకాంత యెట్లు రాఁగలదు? (ప్రకాశము)

మ. అదిరా! యెంతటిదాన వీవగుదు వీ ♦ వత్యంతవిద్యావిశా
రదవై శారదవోలెఁ; గాక బల్గదై ♦ ర్య స్థైర్యగాంభీర్య సం
పదలన్ జారుకళాపరంపరలచే ♦ భాసిల్లుచున్నావు! యా
పదలం బొల్లెడి మమ్ముబోటి జడులన్ ♦ భావించుచున్ బ్రోచుచున్.

మణి:- (తనలో) సత్యరేఖ నా స్నేహితురాలగుటచేత నిక్కడి కావలివారలు నా యాజ్ఞను శిరసావహించి చేసెదరు. (ప్రకాశము) సేవకా! ఇటురమ్ము.

సేవ:- దేవీ! ఏమి సెలవు?

మణి:- ఈ బందిగవు తాళము లిటు తెమ్ము!

సేవ:- ఇదిగో! (అని యిచ్చును.)

మణి:- (పుచ్చుకొని) నీ విక బొమ్ము.

సేవ:- చిత్తము. (అని నిష్క్రమించును.)

మణి:- (తలుపువిప్పి విజయ తేజుని వెలికిఁదీసి) రాజా! బంధ విముక్తి యయినదా? ఇక భూలోకమునకుఁ బోవుదము రమ్ము. చూచితివా! చిత్రపటము! (అని చేతికిచ్చి) ఇదే మా మంజువాణి. అక్కడికే మనమిప్పుడు వెళ్లవలసినది.

విజ:- (ఆశ్చర్యముతో) ఆహా! ఏమి యీ సౌందర్యము! వైరాగ్యముచే దృఢమైన నా హృదయమును సత్యరేఖాసతి తానెంతగాఁ బ్రయత్నించినను చలింపఁజేయలేకపోయినదిగాని ఈ మంజువాణి తన చిత్రపటముచేతనే నన్ను కరఁగించుచున్నది. ఈమె నిజమైన యంగ సౌష్ఠవమెంత వింతగా నుండునో చూడవలయునని నాకును కౌతుకముగానే యున్నది. మణిమాలా! సత్యరేఖ వచ్చువేళయైనది త్వరగాఁ బోవలయును.

మణి:- అవును. ఈ విమానమునఁ గూర్చుండుము.

విజ:- (కూర్చుండును.)

(ఇరువురును నిష్క్రమింతురు.)



## రంగము—భూలోకము.

(మంజువాణి సౌధమున విచారముతోఁ గూర్చుండును.)

మంజు:- (తనలో) మా తండ్రిగారు మఱికొన్నాళ్ళాలస్యమైనఁ జేయక స్వయంవరము చాటించిరి. రారాజు లందఱును వచ్చుచున్నారు. నా కంతకంతకు దిగులులావగుచున్నది. హా! దైవమా! నన్నేమి చేయనైయున్నావో గదా!

మ. నెలఁతయై మాచెలి యేగి నావరుని న ♦ న్వేషించెనో లేదొ? యా
చెలువుం డేమని పల్కెనో? పటము నా ♦ క్షేపించెనో? మెచ్చెనో?
లలి మున్నె ననువంటి బాలికలు లీ ♦ లావార్త లంపించిరో?
తెలియన్ రాదల పాప్తి మెట్లుగలదో ♦ దిక్కెవ్వరో యీపయిన్

ఓ వెఱ్ఱి మంజువాణీ! నీ మిథ్యామనోరథము లింతటితోఁ గట్టిపెట్టుము. నూతన స్నేహితురాలైన మణిమాలను నమ్ముకొని కూరుచుంటివా?

మ. ఎకసక్కెంబుల కట్టులాడెనొకొ దా ♦ నింపూన స్నేహాన కూ
రక భాషించెనో గేలిజేసెనొకొ భర్తన్ ♦ గూర్తు నీ కంచు నేఁ
టికిఁ రా దయ్యె; స్వయంవరోత్సవము నేఁ ♦ డేయంచు నూహింపనో
పక యాలస్యముచేసెనో తెలియ దీ ♦ పై నెట్లు కానున్నదో?

అయ్యో! నా కిఁక నెవ్వరు దిక్కు?

చ. ఒరుల కెఱుంగనీక మది ♦ నోర్చితిగాని వివేకసూన్యులన్
బరిణయ మాడజాల నప ♦ వాదములన్ భరియింపఁ జాలనే
దరులను జేరజాల నురి ♦ త్రాడొ? తటాకమొ? చంద్రహాసమో?
గరళమొ దిక్కునాకు కొఱ ♦ గాని వృథాబ్రతుకేలఁ గాల్పనే.

నా దీనాలాపము లెవ్వ రాలించెదరు? హా! (అని మూర్ఛిల్లుచున్నది.)

(తెరలో)

శా. ఇంతీ! యేల కలతఁ జెందెదవు? నీ ♦ కేహాని వాటిల్లె? నీ
సంతాపంబున కేమికారణము? నీ ♦ సందేహమ్ముఁ దీర్చ నీ
కాంతుం డీతఁ డనంతకోటిరవిసం ♦ కాశుండు సౌమ్యుండు నీ
స్వాంతాబ్జం బలరంగఁ జూడుమితనిన్ ♦ పద్మాక్షులన్ విచ్చుచున్.

(పై పద్యమును జదువుచు విజయ తేజునితో మణిమాలప్రవేశించుచున్నది)

మణి:- విజయ తేజా! చూచితివా? అదిగో! నీయందు ప్రేమచే నీవింకను రాలేదను నధైర్యమునఁ జికురంబులు నేలఁ బొరలాడఁ గల్ప లతవలె నీ మంజువాణి పడియున్నది. (సమీపించి) చెలీ! మంజువాణీ! వడలిన తోఁటకూరకాడవలె నీ విశాల ముకుళిత వదనారవిందపై కన్నుల నశ్రులు రాల శ్రమబిందువులు మేనఁగ్రమ్మ నీ కటికి నేలపై మూర్ఛ వోయి పడియుంటివి. కటకటా! నీసంగతి చూచిన ప్రాణములు తోఁపిల్లు చున్నవి.

విజ:- ఆహా! ఈ చిత్రఫలక మీా రమణీమణిదేనా! సహస్రాంశ మైనను పోలకున్నదే! ఈ సొగసెక్కడ! పటమెక్కడ!

సీ. అరమోడ్పుకన్గవ ♦ యరవిందములఁ గేరు
చెలువంబు గ్రాలనె ♦ ట్లలరు నొక్కొ?
నేలఁ బ్రొల్లెడికురుల్ ♦ నీరదంబుల మీఱు
నలివేణి వేణి యె ♦ ట్లలరు నొక్కొ?
కడువాఁడిక్కరములు ♦ కల్పశాఖలఁబోలు
విలసితకాంతి నె ♦ ట్లలరు నొక్కొ?
ధూళిధూసరితమై ♦ లీల మించుల మించు
నతివ మైకాంతి నె ♦ ట్లలరు నొక్కొ?
విన్న నయ్యొ మోము విధుని ♦ వన్నె వెట్టు
చుండె; నానంద మొదవ నె ♦ ట్లొప్ప నొక్కొ?

నిస్పృహత నున్న మోహంబు ♦ నివ్వటిల్లు
తెలివిమై నున్న స్వాంత ♦ మెట్లులరు నొక్కో ?

ఆహాహా!

చ. సొగసుమిటారి, పుష్పశర ♦ శూరునిచేతి కటారి, నారి, సో
యగమువలంతి జనవ్వనపు ♦ టన్నులమేలిమిబంతి, యింతి నగ
జిగినగుమోముతో సుధలు ♦ చిల్కెడు పల్కులతో ముదంబుతో
బిగియఁగఁ గౌఁగిలించి కదుఁ ♦ బ్రీతిని ముద్దిడుభార్య మబ్బునే ?

వాణి:- ఔరా! ఈమె యెట్టియవస్థలో నున్నది!

ఆ. వె. మంజువాణి చాల ♦ మదనానలంబునఁ
గ్రాఁగి నేల వ్రాలి ♦ కలవరపడి
యూహఁ దక్కి చిక్కి ♦ యూరక పడి యుండె
వలను బడిన చేఁప ♦ పగిది నకట!

(సమీపించి) చెలీ! నీ వెవ్వాని యలభ్యతను గూర్చి పరితపించుచుంటివో అట్టి నీ మనోహరుం డిదె ప్రసన్నుఁడై నిలిచి నీ యవస్థం గని నీ ముందరనే చింతించుచున్నాఁడు. లేచి యీతనిం గౌరవింపుము లెమ్ము! నీ నోము ఫలించినది. (అని చేతితోఁ దట్టి లేపి) ఏమిది ?

ఆ. వె. నిర్భరవ్యసనము ♦ గర్భస్థమైయుండ
మదనబాణములకుఁ ♦ గదలనట్టి
తరుణిమేను, చేతఁ ♦ జరచిన నాఁటునే ?
యెనుముపైని వాన ♦ చినుకులట్లు.

మఱియును.

ఆ. వె. జలధి మండు చున్న ♦ జడదారి మండిన
స్మరశరాగ్నిఁ దనువు ♦ మండుచున్న

సడవి మండు చున్న ♦ నార్పలే రెవ్వరు
దాని కదియె సమయం ♦ దగును గాని.

కొంచెము తాళి చూచెదను రాజా! ఆ పీఠమునం గూరుచుండుము.

విజ:– (అట్లు చేయును.)

మంజు:– (లేచి మణిమాలం జూచి యత్యానందముతో) చెలీ! యెప్పుడు వచ్చితివే? ఇన్నాళ్లవరకు నా కుశలముం దెలిసికొనక యెట్లు సహించి సంచరించుచుంటివి? నీవు నన్ను విడిచి వెళ్లినది మొదట నేటి పర్యంత మీా తీరుననే నీ రాక నిరీక్షించుచుంటిని సుమీా!

మణి:– చెలీ! ఇప్పుడే వచ్చితిని.

తే. గీ. ముకుళితం బైననీమనః ♦ పుష్పమింక
వికసితం బౌను; నీ భాగ్య ♦ విమలవల్లి
నేఁడు ఫలియించు; కనులెత్తి ♦ చూడు మితని
భాస్కరుని జూచు పద్మినీ ♦ వనిత పగిది.

మంజు:– (ఆశతో) ఎవరిని చూడవలయును?

మణి:– నీ వల్లభుని.

మంజు:– అంతటి భాగ్యము నాకు సంభవించునా ?

మణి:– సంభవించునో మానునో! ఒక్క నిముషము తాళుము.

విజ:– (తనలో) ఈ మదవతి తన వెనుకనున్న నన్ను చూడలే దనుకొనెదను. ఈమె వలపులకు కాణాచివలె నున్నది.

మణి:– విజయతేజా! నీ రమణి నీ సందర్శనమునకై వేచియున్నది ఆమెకు దర్శనమిచ్చి యానందింపఁజేయుము. నేనిప్పుడే వచ్చెదను (అని పోవుచుఁ తనలో) ఈ నూతన దంపతుల కెంత నే ననురాగము కలదాన నైనను వీరి ప్రేమాస్పదాలాపంబులమధ్య నేనున్నచో వీరికి సంశయ

ముగా నుండును. కావున నొక యేకాంత స్థలంబున నుండి వీరి సంభాషణము లాలకించెదను. (అని ప్రక్కను నిలచియుండును.)

విజ:- (మంజువాణి సమీపమున కరిగి) ఆహాహా! ఏమి! ఈ చెలువ సుందరాకారంబున నా మనంబును దోలగించుటచే నేనేమియుం జేతగానివాఁడనగుచున్నాను!

మంజు:- (తనలో "తే. గీ. ముకుళితంబైన" అను పద్యమును చదివి) అని వచించినదీ మహారాజునే కాఁబోలును? ఆహా! ఈ సౌందర్య వారాశికి నేను భార్యనగుటచే వీని గౌరవమునకు హాని వచ్చునేమో! నా కరచరణంబులు వడఁకుచున్నవి. ఈయన పాదాబ్జములపైఁబడి "దేవా! నన్ననుగ్రహించి నీ పరిచారికగా ననుగ్రహింపుము" అని ప్రార్థించి వేఁడుకొనియెదను.

విజ:- (తనలో)ఆహా! తలవంచుకొని బొటనవ్రేల నేలవ్రాయుచు నెమ్మేను వడంక ననురాగ ముప్పతిల్ల, ముంగురులనుండి స్వేదబిందువులు ముత్యములవలె రాలిన నులుకుచు నర్థోక్తిని కంఠమెత్తక యేమో వచించుకొనుచు నిలువంబడిన యీ మించుఁబోఁడి సింగారము బంగారు రంగు లీనుచు నా హృదయమును కరఁగించుచు నీరుచేయుచున్నది. ఇట్టి యేకాంతంబున మా యిరువురకును సమావేశ సంతసము సంఘటింపఁజేసిన మణిమాల కుశాగ్రబుద్ధికి వేయు నమస్కారములు చేయవలసియున్నది.

మంజు:- (తనలో) మణిమాల నాకు సఖీవతంసమె చేసిన యుపకారమునకు ప్రతీకారముండదుగదా! ఉన్నను అనన్యసామాన్యాచరణము. నేనీ తనువుతో వేయేండ్లకయినను దీర్చుకొనలేను. ఈ మహా సౌందర్య లక్షణ సమన్విత భాగధేయుని భార్య నాకంటె నెక్కుడు సుందరవతి కావలసియున్నను, నన్ను మోహించునట్లుచేసి తీసికొని వచ్చిన మణిమాల నెఱజాణతనమునకు ప్రతిహతమున్నదా?

విజ:- (తనలో) అర్ధవికాసమైన మోమున నొక్కింత చెలువ ముదయించుచున్నట్లున్నది!

సీ. కాటుక దిద్దిన ♦ కన్నులు వెడదలై
కలువల నిరసించు ♦ కల వహించు
విరిసరుల్ నెఱపిన ♦ కురులింత నిడుదలై
ఘనకులంబుల మించు ♦ గరిమఁ గాంచు
జిగినగ వుదయించు ♦ మొగము వినోదమై
కమలాకృతి రచించు ♦ కొమరుమించు
వలుదవట్రువసిక్క ♦ కులుకుచన్నుంగవ
చక్రాంగనల నెంచు ♦ సందడించు.

అహహా! యెలనాఁగ కీవి యే ♦ మనఁగవచ్చు
నచ్చుపడ నిచ్చవచ్చిన ♦ మచ్చుఁ దెచ్చి
స్వర్ణముఁ గరఁగి యమృతంబు ♦ పదను పెట్టి
ప్రతిమ వోసినయట్టులీ ♦ పడఁతియమరె

మణి:- (తనలో) నేటితో నా ప్రయత్నము పూర్ణముగా ఫలించినది.

తే. గీ. ఈ వధూవరు లన్యోన్య ♦ భావమునను
సంతసించిన నా కగు ♦ సంతసంబు
మొక్క వాఁటి పండించిన ♦ పొలముఁ గాంచి
కాఁపు సంతోషవార్ధిలోఁ ♦ గడఁగునట్లు.

విజ:- (తనలో) ఏదైన నొక మిష పెట్టి యీమెం బలుకరింప వలయును.

మంజు:- (తనలో) ఓ మంజువాణీ! ఎన్ని యిక్కట్లు వహించితివో నీకన్ని సౌఖ్యములు కలుగవలసి యున్నవి.

విజ:- (తనలో) సత్యరేఖ వలనుండి తప్పించి దివినుండి భువికి రావించి నా గ్రహచారములను మరలించి యపూర్వ సంకల్పసంజని తాను రాగము నగపరచిన యీ మణిమాల యనన్య సామాన్య ప్రవీణత కెంతయు శ్లాఘింపవలసియున్నది.

మంజు:- (తనలో) ఆహా!

ఉ. వీని విశాలవక్షమును ♦ వీని మనోహర రూపసంపదల్
వీని విలాసవైఖరులు ♦ వీని భుజాత్త బలప్రతాపముల్
ఏనృపపుత్రి కబ్బినను ♦ నెంతయు గర్వపడంగవచ్చు; నా
పై ననుబోటిబోటి కిటు ♦ వంటి వరుండు నలభ్యుఁడేగదా!

ఈ మహారాజు నన్నొక దాసిగా తన సన్నిధి నుంచుకొనిన నేనొక నిమేషమైన నెడఁబాయక వీని పాదసరోజంబులు తులసీదళంబులచేఁ బూజించుచు నా కోరికలు తీర ధన్యురాల నయ్యెదను.

మణి:- ఈమె హృద్వీధి నెన్నియో కోరికలు వాడముచున్నటులున్నది.

తే. గీ. అఖిలలక్షణలక్షితుం ♦ డసదృశప్ర
సిద్ధలావణ్యుఁ డగువాని ♦ చెట్టవట్టి
యతని యర్ధాంగలక్ష్మినైయె ♦ యలరవలయు
నన్న పేరాస సహజ మ ♦ బ్జాక్షులకును.

మంజు:- నాథా! నమస్కారము.

విజ:- (తనలో) ఆహా! ఏమి యీ సౌజన్యము! (ప్రకాశముగా) రమణీమణీ! వివాహమయిన వెనుకగదా! "నాథా!" అను వానితోఁ బిలువవలసినది!

మంజు:- అట్లేల యోచింపవలయును?

తే. గీ. తొలుత నేఁ జేయునట్టి నో ♦ ముల ఫలంబు
శౌచశీలవ్రతాదుల ♦ సత్ఫలంబు
కలసి మూర్తీభవించె నీ ♦ కరణిఁ; గాన
విధివిధించెను నీవునా ♦ విభుఁడ వనుచు.

విజ:- అవశ్యము స్వయంవరమున రాజలోక మీక్షింప నన్ను వరించెదనని ప్రమాణము చేయఁగలవేని చేయుము.

మంజు:- నేను నిన్ను వరింపనేమో యని నీకు సంశయము కలిగించు నంతటి శౌందర్యశాలినా?

ఆ. వె. నా ప్రమాణమందు ♦ నమ్మక ముండిన
నీ స్వయంవరమున ♦ నేను నిన్ను
నృపతనూజనైన ♦ నిజముగా వరియింతు
నమ్మునీతోడు! పైని దైవ ♦ మమ్మతోడు.

మణి:- (ప్రవేశించి) చెలీ! స్వయంవరము నేఁడాటంకమైనది. తొలుత విశ్వచిద్యాగము చేసిగాని స్వయంవరోత్సవము సేయరట. యీ యధ్వరము సమాప్తమగు సరికొక నెలపట్టును. తావత్పర్యంత మిప్పుడు వచ్చిన నృపాలకు లిందే యుండెదరట. ఈ యవధానమున మీరుభయులు సన్నైత్రిని నెలకొనుఁడు.

(అంత యవనిక పడిపోవును.)

---

## రంగము-స్వయంవరగృహము.

(ఉచితాసనములపై శ్లోకవ్రతుఁడు, మంత్రి, రాజమండలియుఁ బ్రవేశించియుందురు.)

మంత్రి:- రాజేంద్రా! అవశిష్టకార్యము లన్నియు నిర్వర్తింపఁ బడినవి.

ఉ. రాజతనూజు లెల్ల రతి ♦ రాజులకై వడి నీ స్వయంవర
వ్యాజమునన్ బ్రసన్నులయి ♦ వాజిగజంబులు, స్వర్ణడోలికా
రాజము లెక్కి వచ్చి నగ ♦ రంబుఁ గరంబు నలంకరించి వి
భ్రాజితవత్సభాభవన ♦ రాజమునన్ దయచేసి రల్లదే.

శ్లోక:- అమాత్యవర్యా! మంజువాణి వచ్చుటకు సుముహూర్త మింకను రాలేదా?

మంత్రి:- తమ యనుజ్ఞకై వేచియున్నారు.

శ్లోక:- ఈ మహారాజకుమారుల రూపగుణాలంకారముల నభివర్ణించుట కెవ్వరైన నియోగింపఁబడిరా?

మంత్రి:- అందుకు మణిమాల తగియున్నది.

శ్లోక:- మణిమాలవంటి సమర్థురాలీభూలోకంబున లేదు. కేవలము భారతీసతి యనవలయును.

మంత్రి:- అదిగో! అలంకరింపఁబడిన మన మంజువాణి హస్తముం గైకొని మణిమాల వచ్చుచునేయున్నది.

(చెప్పినట్లు మణిమాలయు, మంజువాణియు ప్రవేశించుచున్నారు.)

మంజు:- (ప్రవేశించి) నాయనగారు! నమస్కారము.

శ్లోక:- (లేచి) అమ్మా! వీరపత్ని వగుము!

మణి:- జయము జయము మహారాజ!

(రాజు లందరును మంజువాణి నాశతోఁ జూచుచున్నారు.)

శ్లోక:- (మంజువాణి చేయిపట్టుకొని) బిడ్డా!

చ. వరచిరచారుయావనవి ♦ శోభితసద్గుణభర్మవల్లి! నా
వరములతల్లి! రావె! జన ♦ పాలకు లిందఱిలోన నీమనో
హరుగళసీమ నీ కుసుమ ♦ హారము వైచి కరంబు వట్టినా
బరువును డించి మాకులము ♦ వారికులంబు సముద్ధరింపుమా!

ఇదిగో! ఈ మందార ప్రసూనదామముం గైకొనుము (అని యిచ్చుచున్నాఁడు.)

మంత్రి:– మణిమాలా! రాజపుత్రిక కిందలి రాజకుమారులను వేర్వేఱ నిరూపింపుము.

మణి:– (మంజువాణిం జేరి) చెలీ! ఇటు రమ్మా!

క. ఇదె వర్తించెదఁ జూడుము
మదవతి! నీ కిష్టమైన ♦ మానవనాథుఁ
గదిసి వరింపుము సంశయ
మెదఁ దలఁపక పూలమాల ♦ నిడు మాతనికిన్

ఇదిగో! చూచితివా!

మానినీవృత్తము కాంతరో!

చూడుము కంతలనాథుని ♦ కంతుసమానవికాసుని భూ
కాంతుని సర్వదిగంతపరీతిని ♦ గాఢయశోధనవంతుని దు
ర్దాంతవిరోధికృతాంతుఁ రణోర్విం బు ♦ రాంతకు నీబలవంతుని నీ
వెంతయుఁ గూడి సుఖింపఁగఁగోరిన ♦ నెల్ల శుభంబులు చేకుఱెడిన్

మంజు:– (అనిషమును సూచించును.)

మణి:– చెలీ! ఇటురమ్మా!

కవిరాజవిరాజితము.

మదగజయానరో! ♦ మాళవనాథుని ♦ మంజులగాత్ర స ♦ మంజనుసిఁ
గదిసి వరించిన ♦ కాంచనహార సు ♦ గంధకసత్కన ♦ కాంబరముల్
సదమలచారుశ ♦ శాంకశిలాన్విత ♦ సౌధసమంచిత ♦ సౌఖ్యములుఁ
మదవదరాతికు ♦ మరశిరోమణి ♦ మండలమబ్బును ♦ మండనమై.

మంజు:– (మోముఁ ద్రిప్పుకొనుచున్నది.)

మణి:- ఈవైపుఁ జూడుము!

మత్తకోకిల. కోమలాంగిరో! చూడు మీతఁడు ♦ కోసలేశుఁడు ధీవరుం
డీమనోజసమానసుందరు ♦ నీ మహామహుఁ గోరినన్
సామజాశ్వరథంబులున్ మృగ ♦ సారసారసరోవరా
రామకేళివిహారచారుని ♦ రామముల్ మదిఁ దన్పెడిన్.

మంజు:- (పైకి దృష్టి ప్రసరింపఁ జేయుచున్నది.)

మణి:- సఖి! ఇధరణీధవుని వీక్షింపుము.

భుజంగప్రయాతము. సరోజాక్షిరో! చూడు ♦ సాకేతుఁడో నీ
ధరాధీశునిన్ సైరి ♦ దారున్ వరింపన్
విరుల్ తారహారాద్య ♦ నేకార్థముల్ ప్రా
జ్యరాజప్రమావైభ ♦ వాదుల్ ఘసంగున్.

మంజు:- (తల వంచుకొనుచున్నది.)

మణి:- ఈవంక వీక్షింపుము.

మంగళమహాశ్రీవృత్తము.

ఓలలన! జూడుముదమ ♦ హోజ్జ్వలశుభావహుని ♦ జోచితకళాకళితునీపాం
చాలనృపనందనుని ♦ సద్గుణధురీణు నురు ♦ శాత్రవవిధారకరవాలున్
ఈలలితమూర్తిని న ♦ హీనగుణబంధురుని ♦ నీవిజయు తేజుగళమందున్
మాలికను వైవఁగస ♦ మస్తసుఖముల్ గలుగు ♦ మంగళము
మంగళమహాశ్రీన్

మంజు:- (ఆనందముతో హారమును వైచి చేయి పట్టుకొనఁ బోవును)

శ్లోక:- ఆఁ! నిల్వుము! నిల్వుము!

మ. తనయా! వేయకు వేయు కాకుసుమస ♦ ద్దామంబు విద్వేషి సూ
నుని పాణిగ్రహణంబు సేయఁ దగునే ♦ నోరూరఁ జాంపేయమున్

గని వాంఛించెదు తేటిభంగి:—

(విజయతేజునివంకఁ దిరిగి) మము భం ♦ గస్వాంతులం జేసుఁ బి ల్వని పేరంట మిటేల వచ్చితివిరా? ♦ లజ్జింపఁగా లేవొకో!

మంజు:- (ఖిన్నురాలగుచున్నది.)

మణి:- (తనలో) ఆహా శుభములో విఘాతము వచ్చినదే! శ్రే యపమంగళ ముపశమించుఁగాక!

మంజు:- (మణిమాలవంకఁజూచి కన్నీరు నించుచున్నది.)

మణి:- (జనాంతికముగా) మఱేమియును భయము లేదు. చెలీ! ఊరడిల్లుము అది యేదియో గింగురని ధ్వని వినవచ్చుచున్నది దానిన వలోకించెదముండుము.

(తెరలో)

శా. ఔరౌరా! సురవంచకా! దళితకాం ♦ తాసక్త! యీపాటి నీ
వైరాగ్యంబు స్వయంవరంబనినఁ బో ♦ వంబోలు!; నాకన్నన
య్యారే! పెండ్లికుమార్తె రూపవతియా? ♦ యాఁగాక యెట్లయ్యెనీ
కారాగారవిముక్తి యాగమనమీ ♦ కాంతాసమావేశముల్?

(ఈ పై పద్యమును జదువుచు మహాగ్రహముతో నిద్దఱుభటులు వెంటరా సత్యరేఖ ప్రవేశించుచున్నది.)

మణి:- కట్టా! పిట్టపిడుగువలె సత్యరేఖ వచ్చినది! ఏమి మహోప ద్రవములు జరుగునో! నేనీమె కన్నులఁ బడకుండ దాఁగికొనియెదను. (అట్లు చేయును.)

సత్య:- (కోపముతో) ఆఁ! విజయతేజా! పాపీ! నేను సత్యరేఖ నను భీతియైన లేకపోయెనా? నన్నెంత మోసము చేసితివి! నన్ను విడిచి పెట్టెదననుకొంటివా?

భటు:- అరే! మానవాధమా! తస్కరాగ్రేసరా! మూర్ఖా!

నేఁడు మాచేతఁ జిక్కితివి నీ కండలు తుండెతుండెములుగా ఖండించి వేసెదను చూడుము.

ఉ. ప్రేల్చెదఁ, బిప్పిచేసెద, న ♦ రే! నిను; నీ రుధిరప్రవాహముం
బీల్చెద; మాంసముం మొదడు ♦ ప్రేవులుఁబట్టి భుజించి గర్వముం
వాల్చెద; నన్నెదుర్పఁగల ♦ భంబన వీరుఁడు లేఁడు; లోకముల్
గాల్చిన రక్షచేసిన జ ♦ గాన మదీఁయకృపాణపాణియే!

విజ:- (నిర్విణ్ణుఁ డగుచున్నాఁడు.)

(సభ్యులు గడగడ వడఁకుచున్నారు.)

ఒకపురుషుఁడు:- (లేచి) సభ్యులారా! ఏదో మహోపద్రవము వచ్చినది. మన కీరాక్షసకలహమునఁ బ్రమాదము రాకమానదు. ఇచ్చోటు వదలిపోయినఁగాని మన మానప్రాణములు దక్కవు. లెండు! పోవుదము!

(అని రాజులందఱును పోవుచున్నారు.)

శ్లోక:- (నివ్వెరపడి చూచుచున్నాఁడు.)

మంజు:- (తల వంచుకొని దుఃఖముతో తనలో) హా! ఇది యేమి మహోపద్రవము! హా! నాథా! నిన్ని రక్కసులు యమదూతలవలె నలుచుకొని పీడింపనై యున్నారు! అయ్యో! ఏమి జరుగునో? ఓ భగవంతుఁడా! నీవే కాపాడవలయును.

విజ:- (తనలో) నా కింకను దుర్దినములు వదలలేదు. రక్కసులతోఁగూడ నీ బ్రహ్మరాక్షసి ప్రత్యక్షమైనది! కానిమ్ము! ఆవల దైవమేకలదు. (ప్రకాశముగా) అరే! రాక్షసాధములారా! ఇక్కడ నుండి తరలిపొండు ఊరకే వదరఁబోకుఁడు! ఈ విజయతేజుఁడు వైరివారణమృగేంద్రుఁడని యెఱుంగుఁడు!

ద్వితీయభటుఁడు:- ఓరీ దుర్మతీ! ఏమనుచున్నావు!

ఉ. పోరెదు శూరుభంగి మముఁ ♦ బొమ్మని పల్కెదు వెఱ్ఱివాఁడ! నీ
చారుముఖారవిందము ని ♦ శాతనఖంబులఁ జీరి చీరి దు
ర్వారగదాహతిన్ శిరము ♦ వ్రయ్యలు చేసెద; సత్యరేఖ పా
దారుసరోరుహంబులకు ♦ నొయ్య నమస్కృతిఁ జేయ కుండినన్.

విజ:- ఓ దురాత్ములారా! రాక్షసపిశాచసంతానులారా! ఊర కున్న కొలఁది మత్తెక్కి క్రిందు మీఁదెఱుంగక ప్రేలుచున్నారు! మీ రింకను బ్రతుకఁదలఁచితి రేని నాకుఁ గోపముం గలిగింపక వెడలిపొండు!

ప్రథమభటుఁడు:- ఓరీ! నరాధమా! నన్నే మనుకొనుచుంటివిరా చెడి చావక మాదేవి యానతిం దలఁదాల్చిరమ్ము!

ద్వితీయుండు:- ఓ వెఱ్ఱివాఁడా! ఊరక లేనిపోని బీరములు పలికి మనుజాశనుల మగుమా కత్తులకుఁ బలిపిండవు వైపోకుము!

విజ:- (క్రోధముతో) ఓ నిశాచరహతకులారా! ఈ విజయ తేజుని వీక్షారుణ ప్రతాపము రక్కసులకు రామబాణము వంటిదని తెలిసికొనుఁడు!

భటులు:- ఏమిరా! నీ కండక్రొవ్వు! (అని యిరువురును విజయ తేజు నదలించుచు తాఁకుచున్నారు.)

విజ:- (ఒకని చేతిలోని ఖడ్గముం బెఱికికొని) దురాత్మా! రమ్ము! నేటితో నీ దుశ్చరిత్రము సంపూర్ణము గావించెదను!

ఉ. ఏల దురుక్తులాడెదవొ? ♦ యీహరిణాక్షి పదాంకముల్ జయ
శ్రీల భజించు నీచకుల ♦ సేవక! సిగ్గు జనింపదే! మహా
భీలపరాక్రముండ నని ♦ బీరము లాడెద వేల? నిల్వు మీ
వేళ భవచ్ఛిరంబు బలి ♦ వేసెదఁ బ్రేతపిశాచపంక్తికిన్

శ్లోక:- (తనలో) నా తనయ నా విరోధి రాజకుమారుని వరించుటచేత నీ ప్రమాదము వచ్చినది. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

సత్య:— ఓ భటాగ్రేసరులారా! యుద్ధమందు వీనిని మీరుకాదు గదా వజ్రియైన నెదిరించి పోరి గెలువలేఁడు. నేను వీనిపై మత్తుమందు చల్లి మూర్ఛాగతునిం జేసెదను. మీరలు తీసికొనిరండు! (అని అట్లు చేయుచున్నది.)

విజ:— హా! మంజువాణీ! (అని కత్తి క్రిందవైచి మూర్ఛిల్లుచున్నాఁడు.)

మంజు:— హా! నాథా! (అని మూర్ఛిల్లును.)

(తెర పడిపోవును.)



శ్రీ

# మణిమాల

## చతుర్థాంకము.

### రంగము—రాజమందిరము.

(భార్యయగు గాంధారితో యక్షరాజు ప్రవేశించును.)

యక్ష:- ప్రాణేశ్వరీ! శరచ్చంద్రుఁడు మన సత్యరేఖకు మేనత్త కుమారుఁడగుటయేకాక బద్ధానురాగుఁడై వివాహమాడవలెనని పరిపరి విధముల వేడుచున్నాఁడు అనన్యసామాన్యలావణ్యమూర్తులగు వారి దాంపత్యముం జూచినవారు సంతసింపకపోరు. అదియే మన గర్భకుసుమంబునకు ఫలంబు. కావున, ఈ వివాహమునకు నీవవశ్యమంగీకరింపవలసియుండును.

గాం:- నాథా! మన సత్యరేఖ సౌందర్యవారాశి యగుటచేత శరచ్చంద్రున కనురాగ ముదయించినదికాని మేనమామ కుమార్తె కురూపిణియైన ననురాగార్హయే యని యాతఁ డూహించునా?

యక్ష:- ఊహించునో! మానునో! మన పుత్రికయందట్టి కురూపత్వాదిదోషములు లేనప్పుడు లేనిపోని యనుమానములు కల్పించి కలహించు టెందులకు? ఈ వివాహము నీ కిష్టమా? కాదా?

గాం:- అనుశ్రుతముగా వచ్చుచున్న మన మూర్ఖత యను మహావృక్షము ముదిరి పూవులు పూయుచున్నదిగాని జ్ఞానాగ్నిచే దహింపఁబడుటలేదు ఇంకను మన దేశమునకు నాగరకత యెప్పటికి వచ్చునో! ఈ యనాగరిక సముద్రమునకు పోతేగాని పాటు కనిపించుట లేదు.

యక్షు:- నీ కిబ్బంది కలిగించునంతటి మూర్ఖత నాలో నీవేమి కనిపెట్టితివి?

గాం:- పిల్లలుకన్నవారు పెంచవలయునేగాని పెంచితిమని స్వాతంత్ర్యించి వెనుకముందు లాలోచింపక "మేనత్త కుమారున కిచ్చెదము; వారికిచ్చెదము; వీరికిచ్చెద"మని వారసత్వములు కల్పించి యుక్తాయుక్తములు లెక్కసేయక వారి గొంతుల కురిపెట్టుటకంటె వేఱు మౌఢ్యమేమున్నది ?

యక్షు:- పెండ్లిచేయు భారము తలిదండ్రులది కాదా ?

గాం:- అవును. కాని బలవంతముగా వారసత్వమూహించి నిర్బంధించి చేయుభారము మాత్రము కాదు.

యక్షు:- అటులయిన సత్యరేఖను శరద్రథున కియ్యఁదలఁచుకొన లేదా ?

గాం:- సత్యరేఖ పెండ్లికూఁతురుగదా! దాని నడుగుఁడు. నేనేమి చెప్పఁగలను? కలకాలము సుఖింపవలసిన దంపతుల కిష్టమైన నందఱికిని ప్రియమే.

యక్షు:- చేటీ!

చేటి:- (ప్రవేశించి) ఏమి సెలవు ?

యక్షు:- సత్యరేఖను తీసికొనిరమ్ము!

చేటి:- చిత్తము. (అని నిష్క్రమించును.)

యక్షు:- (తనలో) ఈదేహి కీకష్టము లేలపెట్టవలయును? ఆసృష్టి కీసృష్టి యిష్టముగా నేలతోఁచవలయును?

చ. సతుల వివాహ మాడుట వి ♦ చారము; వారిఁ బరిగ్రహించి సం
తతఁ బడయంగ విచారము; ము ♦ దంబున వారిహితంబుఁగూర్పఁగా
నతనువిచార; మాఁడుపడు ♦ చైన విచారము చెప్పరాదు; త
త్సుత యమదూత, గుండెపయి ♦ శూలపుపోటు వయస్సు వచ్చినన్

సత్యా:- (ప్రవేశించి) నాయనగారు! నమస్కారము! అమ్మా నమస్కారము.

యక్ష:- కళ్యాణమస్తు!

గాం:- నీకు శుభమగుంగాక!

సత్యా:- పూజ్యులారా! నన్ను రమ్మనిన కార్యమేమి? నేనేమి చేయవలయును?

యక్ష:- నీతోఁ గొంత మాటలాడవలసి యున్నది.

సత్యా:- నాయనా! తమకు సమాధానమిచ్చు సంతటివాఁడ

యక్ష:- కాకేమి? వినుము! నిన్నొకనికిచ్చి వివాహము చేసిన గాని మా భారము తీరదు. మీ యమ్మ నన్నడిగి నీ యిష్టము వచ్చిన వరునకిచ్చి పెండ్లి చేయుట కంగీకరించినది. కావున మా కులము నకు తగినట్లు నీ కీడైన యొక సుందరాంగుని వరించి వచింపుము నేఁ చేసెదను.

సత్యా:- (తనలో) "బంధుఁడే కాక సుందరుఁడును, అ ప్రజ్ఞాధురీణుఁడేగాక నీయందు మనసు నాఁటి యున్నవాఁడునగు ధుని నీ వవశ్యముఁ బెండ్లియాడక తీరదు." అని యిదివరకును చుచుండి, ఇప్పుడు మాయమ్మ హితోపదేశముచే నెట్లో పట్టుద ఇప్పుడు నీ కోరిన వరునకిచ్చి వివాహము చేసెదనని విధిలేక చివరనుండి యనుచున్న తండ్రిగారి నేదో మిషపెట్టి యీ పెండ్లి తప్పించుకొనియెదను. (ప్రకాశముగా) నాయనగారూ! తమ శిరసావహించెదను. నన్నడిగిన విషయమునకుఁ బ్రత్యుత్తర మి గాని దాన హాని వాటిల్లకుండునట్లు ప్రసాదింపవలయును.

యక్ష:- నీకేమియు భయములేదు. నిజంబుగాఁ జెప్పుము

సత్యా:- పెండ్లియాడినంతనే సంబరముగాదు భర్తగారి ప చరణ విశేషమున ననుగ్రహపాత్రయై యుండుట కులసతికి

అటు లాచరించినను జీవిత కాలములో లోపము రాకమానదు. లోపము వచ్చెనేని తప్పక కీడుమూడును. దాన ననేకదోషములకు హేతువై పీడ వొందును. అదిగాక, ఒకనాడు దేవేంద్రుని సభాభవనంబున మహర్షులు సభదీర్చి వేదాంతోపన్యాసములు చేయుచు,

మ. కరముల్,వాక్కును,దృక్కుఁగాఁగల మహాకర్మేంద్రియభ్రాంతులెం
 దు సంసారవికారవహ్నిఁబడి దగ్ధంబౌటకూహింతురీ
 శ్వరు నాత్మాకృతిగాఁ దలంపరు, జరాభారంబుపైఁ గప్పినన్
 గరముల్ గాంచి గృశింతురెంతయును భగ్నస్వాంతులై చెల్లరే!

అని యుపనిషదర్థంబు లనేకములు ప్రతిపాదించిన నాటి శ్రవణము నిధిధ్యాసమై ప్రాపంచికవిషయాభిమంబులనుండి బుద్ధి క్రమముగా మఱలి, అది మొదలు రాగద్వేషములం బెటికి వాంఛావివాద సందేహభ్రాంతులఁ బరిత్యజించి సన్న్యాసాశ్రమ స్వీకారము చేయనైయున్న నాకు పెండ్లి యనుమాట తలపెట్టవలదు.

యక్షు:- తల్లీ! సత్యరేఖ! నాకు నీ చరిత్రమువిన్నఁ గడు విచిత్రముగా నున్నది. పదునాలుగేండ్ల వయసుగల పసికూనవు. మావంటి వయోవృద్ధుల కుండవలసిన వేదాంతమార్గము నీ కెందులకు? చంద్రుని వంటి రాకుమారుని పెండ్లియాడి చక్కని చుక్కవలె నుండుట నీ వయసునకు సహజధర్మమగునుగాని విభూతిఁ బూసికొని తావళము ద్రిప్పుటయా? అట్టి దుర్బోధల నీ కెవ్వరు చేసిరి? చాలు చాలు! నీతోడి బాలిక లందఱును నిన్నుఁజూచి పరిహసించెదరన్న భీతియైన లేదా?

సత్యః- విషయలంపటులైన పామరులు దూషించిన సర్వసంగపరిత్యాగులైన యోగుల కేమి చిన్నతనము?

గాం:- నాథా! సత్యరేఖ వేదాంతజ్ఞానమందు కృతనిశ్చయురాలైనది. కావున నింక మీరెన్ని చెప్పియును ఈమె బుద్ధిని మరలింపఁజా

లపు ఈ సంగతి నా కిదివరకుఁ దెలియకుండుటచేతనే యీమె నడిగి వివాహముఁ జేయుఁడని చెప్పియుంటిని.

యక్ష:- అటులైన మనమేల నిర్బంధింపవలయును?

గాం:- మన గర్భవాసమున నుద్భవించినందున కేదో కీర్తింబడయుటయే మన వంశమునకు క్షేమకరము.

యక్ష:- (కుమార్తెం జూచి) తల్లీ! వట్టి యోగాభ్యాసమునకు సంసిద్ధురాలవై దుర్వ్యసనాసక్త ప్రపంచంబురోసి మహాజ్ఞానివై కీర్తిఁ గాంచెదననిన మాకును సమ్మతమే!

గాం:- అమ్మా మమ్మెట్లో తరింపఁజేయుము!

(అని యిరువురును నిష్క్రమించుచున్నారు.)

సత్యా:- మా జననీ జనకుల బారినుండి యెట్లో తప్పించుకొంటిని. కాని నా దురవస్థ లింకను తప్పలేదు. నేను విజయతేజుని వరించిన నన్ను శరదంధుఁడు వరించియున్నాఁడు.

తే. గీ. విరహ మెన్ని కష్టములైన ♦ పెట్టునుగద!
దీని పర్యవసాన మే ♦ తీరు మాఱు
నో? యదృష్ట మెట్లున్నదో? ♦ నోము ఫలము
బ్రతుకనిచ్చునో? లేదో? మో ♦ హితులమధ్య.

మఱియును

మ. కుపితుండై యలుకన్ శరద్రథుఁడు నా ♦ కున్ వైరియైయుండెనే
జపలత్వంబున మందబుద్ధినయి ♦ పాంచాలున్ మహావీరునిన్
గపటం బేర్పడఁ దెచ్చి పెట్టితి దివిన్ ♦ గళ్యాణ మాదంగ నే
యపవాదం బుదయించునో? తుదకు నే ♦ హానుల్ తటస్థించునో?

విజయతేజుఁడు నా యందెంత కృతఘ్నుఁడైనను వానిని విడుచుట కెం

తయు నా మనంబెడ మీాయకున్నది. ఇప్పుడే వానివద్దకుఁబోయి నాకపట పాండిత్య ముపయోగించి నా యందు మరులుకొనునట్లు చేసెదను.

(అని నిష్క్రమించును.)

## రంగము—పురవీధి.

(ఒక యరుఁగుపైఁ గత్తిపట్టుకొని శరదభ్రుఁడు కూర్చుండి యుండును.)

శర:— హా! సత్యరేఖా! ఈ విరహి నొకింత కనులెత్తిచూడుము. నీ కటాక్షామృత సేచనముచేఁ గొంత మనశ్శాంతి కలుగునేమో! పోకుము! పోకుము! ఈ చంద్రహాసముచే నా శిరము తనువుతో వేఱు చేసి మఱిపొమ్ము!

తే. గీ చాలదే మోస మింక? హా! సత్యరేఖ!
వినుము! నీపైని నున్న నా ♦ ప్రేమ యిదిగో! (కత్తి పారవేసి)
ఖడ్గమునఁ జీల్చి చూడుము! ♦ కాంచఁగలవు
సత్యరేఖాపటంబు హృ ♦ త్సరసిజమున.

తే. గీ. ఉనిడ నీయందు దగిలి నా ♦ కున్నయట్టి
వలపు వ్యృషగాదు ఇది యేక ♦ పక్షమగుట
ఏచుచున్నది విరహాగ్ని ♦ యీావిధాన
రమణి దెలియవు కోపకా ♦ రణముచేసి.

మిమ లల్లి మృషోక్తులాడి వలచితినని వలపించి విలపించెడు నన్ను దయఁ దలంచక యెంతో నమ్మించి మోసపుచ్చి పోయితివి. నీ వచ్చమైన ఉచ్చరపైన రిక్తమూాట లేల చూడెదవు? నిన్ననవలసిన పనిలేదు. నా దురదృష్ట మిట్లొడ్డించుచున్నది. హా! హృదయమా! మఱికొంతసేపు శాంతింపుము! నీవు సుఖవిశ్రాంతి వహింపవలసిన కాల మాసన్నమగుచున్నది. ఒకే పర్యాయ మీాలోకమే వదలిపోవును.

తే. గీ. తిరిగి యెట్టయ్యె నాదుర ♦ దృష్టరేఖ?
సత్యరేఖ చేఁజిక్కి మో ♦ సంబుచేసి
పోయె దొరకినమణి జారి ♦ పోయినట్లు
తలఁచి యేమిచేయుదును రో ♦ దనముకంటె.

ఈ పవిత్రమైన సుపరత్నముకంటె నొక పర్వతదరీతటంబున భిల్లుఁడనై పుట్టిన నీ జీవున కిన్ని వేతనలు లేకపోవునేమో! ఆహా! ఊహా యుద్యోగ మేలవలయుననిన వ్రాత ఆళ్లు మోయింపఁదలఁచుచున్నట్లు నా తలంపులన్నియు నీటఁ గలసినవి. దిక్కుమాలిన ఋషి పక్షివలె వ్రేలాడుచు కంటికిఁ గన్నీళ్ళకు వేఱుచేయక యెంత యేడ్చినను సత్యరేఖ యీ దౌర్భాగ్యునకు నీ తనువుతో లభించుట వట్టిది గదా! అని నా మనసుమాత్రము మూరడిల్లకున్నది. ఈ తల్లడపాటంతకంతకు విచారముతో ముదిరి యొక మహాగ్నిజ్వాలయై పరిణమించి శరీర మాపాదమస్తకముఁ గ్రాఁచుచున్నది. ఏమనుటకును నోరాడకున్నది.

మ. అహహా! నా విరహానలంబు వెలిఁ దీ ♦ యన్ వచ్చు నేనిన్ సరో
రుహజాండంబును రోదసీకుహరమున్ ♦ శోధించు; సంద్రంబులన్
గహియించున్! గిరులన్ బగల్చు వనులన్ ♦ గాల్చున్; దిశల్ కూల్చునీ
మిహికాంశుండు ప్రతాపమూర్తి యగుచున్ ♦ మింటన్ బ్రదీపింపఁడే?

ఇట్టి దుఃఖాబ్ధికిం ధనమైన తనువుతో దినములఁ దెల్లవార్చుచుండు నా మొండి జన్మమును జూచిన నెవ్వారికిని జాలియైన రాదు గదా! ఏవారిఁ బరికించినను ఎన్ని వేషములు వేసినను ఎందఱిని మ్రొక్కుకొన్నను ఏమని మొరపెట్టినను నా కెవ్వరుదిక్కు! ఆర్తరక్షకుండెవ్వఁడు? జీవచ్ఛవమునైన నేనెందుల కీప్రపంచమున కక్కరకువచ్చెదను? ఓ! పాపపు శరద్రథా! పలుగాకివై వేయువత్సరము లున్నను నీ చరితలు నిందనీయము లేసుమీ! ఊరకే రిత్తకోరిక లుబ్బూఁతలూఁప నింక నెన్నాళ్లిట్లు

విలపించెదవు! విలపించినను నీ మనోరథముసిద్ధించు విధమేమైననున్నదా! సత్యరేఖ నీకు దొరకునా! అయ్యో! ఇంకెక్కడి సత్యరేఖ! సత్యరేఖకును నీకును పూర్వపశ్చిమాద్రుల కున్నంత యెడము.

చేటిక:— (అప్పుడు పూలజంగిడితోఁ జేటిక ప్రవేశించుచున్నది) వనము విడిచి పురము ప్రవేశించినాను. ఇక నాబుద్ధి నెరపి పువ్వులమ్మి సవ్వులు సంపాదింపవలయును. జవ్వన మెంతలేసి కార్యములైనను జేయ సాహసించునుగదా!

(పువ్వు లమ్ముట నభినయించుచు)

ద్విపద.

పువ్వులు కొనెదరా! ♦ పూఁబోణులార!
నవ్వు లాడెడునట్టి ♦ నవఁబోణులార!
మరుని పూజించిరఁట ♦ మరుసాయకములు
తరువుల రాలుసుం ♦ దరలతాంతములు
మధుపాళి కిరవైన ♦ మందారములును
మధురసాన్వితమైన ♦ మల్లెమొల్లలును
సౌగంధికంబులు ♦ సారసంయుతము
లౌగంధఫలులును ♦ నరవిందములును
విరులు గొజ్జెంగులు ♦ విరజాజిపూలు
మరువంబు దవనంబు ♦ మఱికొన్ని గలవు
రమణీయమై యల ♦ రారు మావిరులు
సుమకోమలాంగులు ♦ చూచిన విడరు
విరులు సరుల్ గ్రుచ్చి ♦ విభుల కిచ్చినను
తరుణుల నెడఁబాయఁ ♦ దరమె వారలకు?
లలి సముల్లాసవి ♦ లాసంబు సలుపు
వెలఁదుల కిచ్చిన ♦ విభులఁ బాయుదురె?

సురల కర్పించిన ♦ సుఖము లీడేఱు
ధరణీవరుల కీయ ♦ ధనము చేకూఱు
శయ్యలపై వైచి ♦ శయనించి రేని
దయ్యాలు దేవతల్ ♦ దగ్గర రావు
కలవరింపులు రావు ♦ కలలేవి రావు
కలకలమని మనః ♦ కమలంబు విడుచు
కార్యముల్ సిద్ధించు ♦ కామముల్ హెచ్చు
ధైర్యశౌర్యోరుసాం ♦ దర్యంబు లబ్బ
పుచ్చుకొనుండు మా ♦ పూలబంతులను
అచ్చపుటనురాగ ♦ ఫలవడు మీకు!

పురవీథులన్నియుం దిరిగి తిరిగి వెదకి వేసారినను పువ్వులు గొను సుందరాంగు లింతవర కెవ్వరును గానరారు. నే నీవేళ నెట్టి దుష్టుహూర్తమున బయలుదేరితిని! పొద్దెక్కినకొలదిని పువ్వు లెట్లు వాడిపోవు చున్నవో నా కరచరణాబులు నట్లే యెండచే వాడుచున్నవి. ఈ వీథి నెవ్వరైనఁ గొనెదరేమో చూచెదను.

తే. గీ. పుష్పలావికలము నవ ♦ పుష్పవతుల
కమ్మువారము మరుసాయ ♦ కమ్ములనఁగ
పుష్పములు చారువాఙ్మనః ♦ పుష్పములనఁ
బుష్పములవెల నూతన ♦ పుష్పవతియె.

విటు:- (ప్రవేశించి) ఈ పువ్వులమ్ము పువ్వారుంబోఁడిపలుకులు తేనెలసోనలై వీనులకు విందుచేయుచున్నవి అమ్మ్యారే! ("పుష్పలావికలు") అను పద్యము చదివి ఏమి యీ ప్రౌఢ వాక్చాతుర్యము? నాకేమియు నర్థముకాలేదు.

శర:- (తనలో) మా సత్యరేఖయే యుండెనేని యెన్నిపూవులం గొని నా మెడను వైచియుండునో!

చేటి:- (పాడుచున్నది.)

పూలు గొనరే! మల్లెపూలు గొనరే!

1. కేళికావనపాళి మంజుల ♦ డోలికాజలకేళిఁ దేలుచు
బాలకేళుల నోలలాడెదు ♦ నీలకచసుందరులు! జాజీ ॥పూ॥

2. నవమణీమయపద్మపల్లవ ♦ భవనముల శోభిల్లుపాన్పుల
జవముతోఁ గనగూడి యాడెదు ♦ నవవధూమణులార! బంతీ ॥పూ॥

3. చారుసౌరభపూరపూరిత ♦ పారిజాతసరోజవరము
దారకుందలతాంతములు మీ ♦ కోరినట్టివి గలవు మొల్లా ॥పూ॥

విటు:- (తనలో) మాబోఁటి విటులం జూచితైన సిగ్గునఁ దలవంపక నిగ్గుదేలు తేటమాటలతో ముద్దులుమూటగట్టు పాటలుపాడుచు తన నీటుగీటు లెంత వింతగా దోఁపించుచున్నది! తప్పక యీ పువ్వులు బేరమాడి యెంతకైనఁ గొనియే తీఱవలయును. (ప్రకాశము) ఓపువ్వుల చేటికా! ఇటురమ్మా!

చేటి:- వచ్చితి నెందులకు? పువ్వులు కావలెనా?

విటు:- పుష్పవతులకేగాని వారిమగల కియ్యవఁటగాదు!

చేటి:- వెల కావలయునేగాని మాకా వ్రతమక్కరలేదు.

విటు:- ఇవి నీ వెల పూగుత్తులా? హా! హా! (అని నవ్వును.)

చేటి:- నవ్వులు గావు ఇవి పువ్వులు! కావలెనా! పోవలెనా!

విటు:- కావలసినవి కావలెను. పోవలసినవి పోవలెను.

చేటి:- నీకుఁ గావలసిన వేవి? పోవలసిన వేవి?

విటు:- కావలసిన పువ్వులు పోవలసినవి సంశయములు.

చేటి:- ఎవరికేమి కావలెనో బాహాటముగా నంగడిలోఁ బెట్టి యమ్మువారికి సంశయములు, సిగ్గులు నుండునా?

విటు:- సరే! నిజమే చెప్పితివి.

చ. విరిసరు లెంత కిచ్చెదవు? ♦ ప్రీతిమెయిన్ సుమగుచ్ఛయుగ్మ మే
దరకు నొసంగెదీవు? సము ♦ దారజపాకుసుమం బదెంత? తా
మరసదళంబులెంత వెల? ♦ మంజులవాణి గులాబి యెంతకుం
దొరకును? నీదు వాఙ్మధుర ♦ ధోరణులన్ వెలయింపు మింపుగన్.

చేటి:– (జల్లెడ దించి) కొనువారా? మీరు వినువారా?

విటు:– కొనువారు ముందు వినవలయును.

చేటి:– మా పువ్వుల వెల వాసనయే చెప్పును.

విటు:– నీవు చెప్పిన నెట్లుండునో? చెప్పుము! ఇంతలో నశింపవు! పెదవులు కందవు! వరాలు రాలవు.

చేటి:– అటులయిన వినుము.

చ. విరిసరు లాఱునూర్లు; పది ♦ వేలిడినన్ సుమగుచ్ఛయుగ్మముల్
దొరకు; జపాసుమంబు పలు ♦ తోయము లంటకు కోటిసేయుఁ; దా
మరసదళంబు లియ్యవి సు ♦ మంబులె? చూచిన లక్షసేయు; మేల్
తరము లమూల్యముల్ గద! గు♦లాబులు ముద్దులుమూటగట్టెడున్

విటు:– అబ్బో! ఈ బేరము చాల ఘోరముగా నున్నది!

చేటి:– అట్లయిన నీవు సరసుఁడవు కావు.

విటు:– నీవు రసజ్ఞురాలవు కావు.

చేటి:– కానని నీవెట్లెఱుఁగుదువు?

విటు:– నీ దండ లింతప్రియమా!

చేటి:– ప్రియమా మఱిప్రియమా?

విటు:– ఆ ప్రియము మాటలకా? పాటలకా?

చేటి:– అర్థములకు.

విటు:– స్వార్థపరిత్యాగు లుండరా?

చేటి:– ఉండిన సత్యరేఖవంటి దెవ్వరైన నుండునేమో?

విటు:- సత్యరేఖ మన రాచకన్యగదా! ఆమె యేమిచేసినది?

చేటి:- నీ వెఱుంగవా?

విటు:- నీపాదమాన! నా కేమియుఁ దెలియదు. దయచేసి చెప్పవలయు.

చేటి:- మేనత్తకుమారుఁడైన శరదశ్రుని వివాహ మాడనని తల్లిదండ్రుల మాటలను త్రోసివేసి చెలికత్తెలను రోసి విభూతిం బూసికొని యోగినీ వేషమువేసి యీశుని భజించుచు మఠమునందు దండక మండలములం దాల్చి ముక్కు మూసికొని జపమాలిక లెక్కించుచు లోలోపల గొణుగులాడుకొనుచున్నది.

విటు:- ఎవరైన చెడిపిపెట్టి పిచ్చిదానిని చేసిరా యేమి?

చేటి:- ఎవరున్నారు? అన్నిఁటికిఁ గామదేవుఁడే!

విటు:- బైరాగుల కేమికామము?

చేటి:- ఏమికామమా? మోక్షకామము!

విటు:- ఓహో! అదియా! ఆమెను మనము చూడవచ్చునా?

చేటి:- బైరాగులమై వెళ్ళి చూడవచ్చును.

విటు:- అటులైన రమ్ము! పోయి చూతము. (ఇద్దఱును పోవుచున్నారు.)

శర:- ఈ పుష్పలావిక నాకిప్పుడొక మార్గముపదేశించినది. సత్యరేఖ తపశ్శాలినియైనదఁట! అట్టి తపోధనురాలైన పుణ్యవారాశి పాద సరోరుహములపైఁబడి నా తల బ్రద్దలు కొట్టుకొని పుణ్యలోకమున కరిగి కృతార్థుఁడనై సుఖించెదను. ఇంతకంటె నా మోహాగ్ని పరంపరలకు పరిసమాప్తికరమైన తెరువులేదు. (రెండడుగులు నడచి)

తే. గీ. స్మరశరపరంపరలచే వి ♦ చార మధిక
మగుచు మేలెల్ల వసివాడ ♦ నడలి హృదయ

మంత కంతకుఁ గరఁగి ♦ నీరౌచు నుండె
కాఱువానలోపల బెడ్డ ♦ కరఁగినటుల.

హా! దైవమా! ఆమె సందర్శన మెట్లగును? బైరాగుల కగును గదా! నే నొక బోడిబైరాగినే కావున నడ్డముండరాదు. "చచ్చువానికి సముద్రము మోకాలిబంటి" అనునట్లు నా కిప్పు డేయడ్డము లున్నను లెక్కయేమి?

(అని నిష్క్రమించుచున్నాడు.)

## రంగము—సౌధాంతఃపురము.

(విజయతేజుఁడు విచారముతోఁ గూర్చుండి యుండును.)

విజ:- హా! మాయలమారి సత్యరేఖ యెక్కడ నా ప్రాణము లకు దాపురించినదోగాని నన్నుఁగొఱికి నాకడుపులో నిద్రించుచున్నది. ఈ దేవతకును, నాకును ఎటుల సంబంధము కుదురును?

క. ఒకజాతి కొకమతంబున
కొకజగమున నుండువారి ♦ కొకధర్మమునం
దొకరి కొకరి కగు సఖ్యము
ప్రకటింప వివాహమహిత ♦ బాంధవ్యంబుల్.

ఇఁక నాకేమి చేయుటకును తోఁచకున్నది. మంజువాణి స్వయం వరమున నుండఁగా నల్లరిచేసి యిచ్చటికిఁ దీసికొని వచ్చిన ఈ మాయా దేవి నన్నేమిచేసినను చేయఁగలదు. ఈ సౌధమున కావలనున్న తోఁటలో నన్నొక బైరాగివేషముందాల్చి రమ్మని కఠినముగా నాజ్ఞా పించినది. ఆలస్యము సేయక నా యలంకారములను పూర్తి చేసికొని వెళ్లెదను. వెళ్లకుంటినా దాన హాని యున్నది. అటు లెందులకుఁ జేయ వలయును?

తే. గీ. మంచితనమునఁ బగవాఁడు ♦ మడియు చుండ
చెడ్డ చేయుట తగ దట్లు ♦ చేయు నేల?
బెల్లమునఁ జచ్చువానికి ♦ విషము వోసి
లేనివ్యసనంబు పడు టవ ♦ మానవృత్తి.

ఆహా! మా మంజువాణి యెంతకును మరపు రాదుగదా! ఓ నా హృదయేశ్వరీ! బంగారుబొమ్మా! నిన్నిఁకఁ గలిసికొనుట కలలోనివార్త గదా!

ఉ. హా! రమణీమణీ! మృదుక ♦ రాబ్జములన్ మెడవైచియున్న మం
దారలతాంతహారము గ ♦ దా శరణంబు? మనోహరాంగి! నిన్
జేరి సుఖించిపోదు నని ♦ చేసె వియోగము నాకు ధాత యీ
తీ రెటనైన నుండునె? స ♦ తీమణు లాఁచికొనంగ వింటిమే?

చ. మరచితిఁ దల్లిదండ్రులను ♦ మాన్యుల మిత్రుల నెల్లబంధులన్
మరచితిఁ గాని మానిని స ♦ మంజసవాణిని మంజువాణి నే
కరణిని జూచినన్ మరపుఁ ♦ గాన; నయో! కలవచ్చినన్ స్వయం
వరమునఁ బూలదండ మెడ ♦ వైచెదు కైవడిఁ దోఁచు మాటికిన్.

ఇంతకును పెద్దలయిన జ్యోతిష్కులను వంచించిన మహాపాతక మిాసత్యరేఖారూపమును గైకొని నన్నుఁ బీడించుచున్నది. తుదకు నా కర్మ మెటులున్నదో యట్లు కాకమానదు గదా!

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

## రంగము—మఠము.

(సత్యరేఖ బైరాగులతోఁ గలసి కూర్చుండియుండును.)

సత్య:- (తనలో) మొన్న దేవేంద్రాదులు మాచేత నాడించిన నాటకములో నేను వల్లించిన మునివేషపాఠము నేఁడీ కపట మునివేష

మున నుపన్యసించుట కక్కఱకు వచ్చును. ఈ బేలలయిన ముసి ముచ్చులు విని సంతోషించుటకుఁ జాలును.

యోగి:- దేవీ! ఇంతవరకు నీవు ప్రబోధించుటవలనఁ గొంత కర్మ రాహిత్యమయినది. కాని,

క. ఏయోగంబునఁ గల్మష
మాయాసంసారవాంఛ ♦ మాయునో? యెటు లీ
కాయంబు విడువవలయునో?
ఏయాకృతి నుండవలెనో ♦ యెఱిఁగింపు కృపన్.

సత్య:- వాంఛామూలంబైన ప్రపంచమునందు దృష్టిని విడి సమాధి నిష్ఠాగరిష్ఠులై

సీ. పంచేంద్రియంబులు ♦ బంధించి ప్రాణముల్
హృదయాబ్జమున నిల్పి ♦ కదలనీక
భ్రూమధ్యవీథిని ♦ బొలుచుహంసను దెల్పి
ఫాలభాగముఁ జేర్చి ♦ ప్రకృతితీవ్ర
మణఁచుయోగికిని బా ♦ హ్యాభ్యంతరంబులఁ
జీఁకటుల్ పోవును ♦ చేటు లేదు
స్థూలశరీరంబు ♦ శోభిల్లు రేచక
పూరకంబుల నాత్మ ♦ పొదలుచుండి
బిందునాదంబు కళలతోఁ ♦ బొంది యుండు
విశ్వమంతయుఁ దనయందు ♦ వెలయు చుండు
శాంతఘోరమూఢము లుప ♦ శాంతి నొందు
ననయమును దా వెలుంగు సూ ♦ ర్యుని తెఱంగు.

ఓ జడదారులారా! ఇంతవరకు నాచేతఁ జెప్పఁబడిన ముముక్షు యోగము భోగాపేక్ష లేనియోగికి నిర్గతకర్మంబైన స్వర్గాపవర్గమార్గ

మును ప్రదర్శించును. ఎంతకాలమీ మాయామహాండకోశమున నరిష డ్వర్గవాంఛావివాదాలంకారుండై నీ నా ధ్వనులఁ గలహించి పరితృప్తి లేక తిరుగాడుచుండునో అట్టివాఁడు శైవాలజాలంబులం దగులుకొనిన యీతగాని భంగి మిక్కిలి చిక్కులంబడి విఫలమనోరథుఁడై కృశించి పంచత్వంబు నొందును.

చ. తనువులు గావె బుద్బుదవి ♦ ధంబులు? బాంధవమిత్రపుత్రికా
జనము ఋణానుబంధ మగు ♦ స్వప్నసమం బగు వైభవంబులన్
వనరుచు నెండమావులకు ♦ బారుమృగంబులభంగిసత్య మి
ట్లనుకొన లేక కల్మషగృ ♦ హావ్రతులై చెడి చావ నేటికిన్?

మ. అరిషడ్వర్గములన్ జయించి కపటా ♦ వ్యక్తాదులందోసి హృ
త్సరసీజంబునఁ బ్రాణముల్ నిలిపినా ♦ దబ్రహ్మమై గుండలాం
తరశక్తిన్ ధృతివేణుపూరమున మో ♦ దంబారు జీవుండెపో
పరమాత్ముండు వివేకిగాని కలఁడే ♦ పాపాత్ముఁ డూహింపఁగన్.

కావున నంతర్లక్ష్యభావమును దృఢపఱచి యసంప్రజ్ఞాతసమాధిని దేహముతో నాత్మను విడుచునట్లు చేసి యుపాసించిన మీ కేలోకంబు నను హాని లేదు. పునరావృత్తిదోషంబు లేక సుఖించెదరు

యోగులు:- నేఁడు బ్రహ్మానందమైనది.

సత్య:- జోగులారా! నేను సమాధి కేగవలయును మీరింక వెళ్ళి రండు.

యోగు:- భగవాన్! భగవాన్! (అని నిష్క్రమింతురు.)

సత్య:- నా యాజ్ఞ నుల్లంఘింపక తపసివలె మా విజయ తేజుఁడు దయచేయుచున్నాఁడు? అదిగో! ఇన్నాళ్ళ కీతనియందు పూర్ణానురాగము కలిగినది. నా పుణ్యము ఫలించినది. నేనింక ధన్యురాలనైతిని. నా జన్మ యౌవన సౌందర్య కలావిలాసంబులు సార్థకంబులైనవి. నేనీ జేగురు

గుడ్డలతో నుండిన తానేమి యసహ్యాపడునో? ఇక్కడ నెవరున్నారు? తీసిపాఱవైచెదను. (అట్లు చేయును.)

(శరద్రథుఁడు మునివేషముతోఁ బ్రవేశించుచున్నాఁడు)

సత్య:- ప్రాణేశ్వరా! ఇట్లు దయచేయుఁడు!

శర:- (తనలో) ఓహో! ఏమి! నా పుణ్యము! నన్నుఁ ద్రుణప్రాయునిగాఁజూచు సత్యరేఖ "ప్రాణేశ్వరా!" అని పిలిచి తన మోహాను రాగమును జూపించుచున్నది. ఈమె మనసింతగా నెట్లు మాఱినదో? మేనత్త కుమారుఁడైన శరద్రథుఁ డుండగా నొరుల వరించుట రాక్షస కృత్యమని యీ వెఱ్ఱిదు యోగులు బోధించి పుణ్యముం గట్టుకొనియుందురు. నేఁడు నేనెంత ధన్యుఁడను! నా విచారాంధకారము మొదలంట నశించి సర్వాంగములు వికశించినవి. నా ముద్దులగుమ్మ నా మురిపెంపు చిన్నిపొన్నారి నా మనోహరాంగి నాయందెట్టి మోహావేశపరవశురాలై "ప్రాణేశ్వరా!" అని పలికినదో? సుధలు వెదజల్లి విరహాగ్నిచే సగము చచ్చిన నన్ను సజీవునిం జేసినది. ఆహా! ఏమి! ఈ మనోహర వాఙ్మాధుర్యప్రేమమహాత్మ్యము! తెప్పపాటులో మా సత్యరేఖ యెంతవింతగా మాఱిపోయినది! నిన్నదాఁక నన్ను లెక్కసేయని యీ యన్నులమిన్న నా పాలిటి కొంగబంగారమైనదే! ఓ కోమలాంగి! ఓ కుసుమగంధీ! ఇంకొక గడియవఱకు నీ విటులూరకుండిన నీ చరణసరోరుహముల కీశిరము సమర్పింపవలసినవాఁడనుసుమీ!

సత్య:- ఈ యుచితాసన మలంకరింపుఁడు.

శర:- (తనలో) నేనట్టి యకార్యమునకు సమకట్టితినని యా దేవాదిదేవుఁడు సత్యరేఖ హృదయక్షేత్రమున మోహానురాగబీజములు నాటి తుట్రటిలో ఫలింపఁజేసి నన్ను కృతార్థునిం జేసియున్నాఁడు ఇదియే వాని యమానుషశక్తిని జాటుచున్నది.

(ఆగ్రహముతో యక్షరాజు ప్రవేశించుచున్నాఁడు.)

యక్ష:- (తనలో) అకటకటా! నేనెటుల నా దుఃఖాగ్రహము నిల్పుకొనఁగలను! ఈ గొంతున కురివెట్టుకొనిన బాగుగానుండును.

చ. వరసుకుమారి, సుందరి శు ♦ భంబులమూట, రమాసమాన, నా
యరుదతగు నోముపంట, కడు ♦ పారఁగఁ గన్నకుమారి, గర్భసా
గరమున కొక్కమాణిక్యము, కన్నులపండువు, సత్యరేఖ ని
ర్భరకులదుర్గవార్ధిబడ ♦ బానలమై చనెనిప్పు డక్కటా!

అయ్యయ్యో! కడుసారఁ గన్నకుమారికలు కామాసక్తచిత్తలై కార్యాకార్యము తెలియంగక యథేచ్ఛముగా బొంకుచు అంకిలాడ నారామసీమలం జేరి స్వైరవిహారంబు సేయుచు మతిమంతుల హితవచనముల వినక ఉచ్చనీచపరిజ్ఞానము విడిచి చరించుట చూచిన తలిదండ్రుల హృదయము లెటుల క్షోభించునో సముద్రములయిన మొత్తిపెట్టి చెప్పఁజాలవు. ప్రళయకాలమేఘములు ఘోషించి సూచించునేమో! కటకటా! ఇట్టి కులటలు పుట్టిననేమి? గిట్టిననేమి? మా తలల నిట్టి యపవాదముం దెచ్చిపెట్టుటకుముందే సత్యరేఖ మా గొంతుల కురివెట్టి యీసీ దుస్సాహసకార్యములకు సమకట్టవలయును. చెల్లరే! పొరలిపొరలివచ్చు నా దుఃఖతరంగములు నిర్భరములై కడుపు వ్రక్కలుసేయుచున్నవి. ఆహా! పదుగురిలో నే నెటుల దలయెత్తికొనఁగలను? నా మొండి బ్రదుకు చూచిన జను లేమనుకొందురు? మత్తునందు పడినటుల నా చిత్తము మొద్దుదేరి కర్తవ్య మూహింపలేక డోలాయమానమై విభ్రాంతి కలుఁగజేయుచున్నది. అయినను సత్యాసత్యములు విమర్శించి తోఁచినటుల చేయవలయును. విజయు తేజు నెక్కడఁబెట్టెనదో చూచి వచ్చెదను. (అని పోవుచున్నాఁడు)

సత్య:- నాథా! జాగుచేయక యీ వంకకు రమ్ము. తండ్రిగారు వచ్చుచున్నారు. మన యిరువురి సమావేశ మిటులే యేకాంతస్థలమునం గలుగుట కవశ్య మాగ్రహింపక మానఁడు.

శర:- ఇదే వచ్చుచున్నాను.

సత్య:- (తనలో) ఈతని నెచ్చట దాఁచుటకును వ్యవధిలేదు ఇక్కడ తగుచోటు సరిపడయినదిలేదు. ఓ దైవమా! ఇప్పుడేమి చేయ వలయును! ప్రమాదము వచ్చినది. ఈ పొయిమీఁద నీళ్లు కాఁచుటకు పెట్టినగాబులోఁ గూర్చుండఁబెట్టెదను. (పైమూఁతఁదీసి) హృదయేశ్వరా! తండ్రిగారు వెడలు పర్యంతము నిందులోఁ గూర్చుండుము నా తప్పు సైరింపుము. నీవె నా దిక్కు. పాట్లన్నియును విరహులవేగదా!

శర:- నీ వట్లు సంశయింపవలదు. నీ యాజ్ఞను శిరసావహించుట నాకు పరమభాగ్యము. ఈ ప్రాణమే నీ యధీనము. (అని గాబులోఁ ప్రవేశించును.)

సత్య:- (తనలో) ఏమి! ఈ వైపరీత్యము! తండ్రిగా రెప్పుడును ముందే వర్తమానమంపివచ్చుట కలదుకాని యిట్లాకస్మికముగావచ్చుట యెన్నఁడును లేదే! ఏమోకాని నాకుడికన్నదురుచున్నది. తగినంతకంటె మహాహానిలేకపోలేదు. ఉన్నను చేయునదేమున్నది? ఈశ్వరుఁడే పాలింపవలయును. ఇదిగో! నాయనగారు. (ముందునడచి) నాయనగారు! పాదపంకజములకు నమస్కరించుచున్నాను.

యక్ష:- (ఊరకుండును.)

సత్య:- (తనలో) ఆశీర్వాదమైన జేయక పెడచెవిం బెట్టి యూరకున్నాఁడు. ఏమి దురాగతము వచ్చినదో? (ప్రకాశము) తాము దయ చేసిన కార్యమేమి? నా వలన నేమైనఁ గావలసియున్నదా?

యక్ష:- నీవలన నాకక్కర లేదు. మేమే చేసికొనియెదము. నీవు మాత్రము మావెంట నుండవలయును.

సత్య:- చిత్తము అట్లే యుండెదను. (తనలో) నా రహస్యము బయలఁబడినది. ఇఁక నా బ్రదుకునకు నీళ్ళు వదలుకొనవలసినదే. కామును కస్తూరియు నెప్పటికిని దాఁగవనుట వాస్తవము.

యక్ష:- ఈ మేడగదుల తలుపులన్నియుం దెరచియేయున్నావా?

సత్య:- కొన్ని మూయఁబడి యుండవచ్చును.

యక్ష:- విప్పెదవా? లేక విప్పించనా?

సత్య:- నాచేతనే విప్పించుఁడు!

యక్ష:- నా యభిప్రాయమునదే. నడువుము!

సత్య:- (నడచుచు) హా! దైవమా! ఎంత తెచ్చిపెట్టితివి? ఇక నేమి చేయవలయును? నా బ్రదుకున కెంతమోసము వచ్చినది?

యక్ష:- ఈ గది విప్పుము!

సత్య:- (విప్పుచున్నది.)

(ఇరువురును లోపలకు వెళ్ళుదురు.)

యక్ష:- (పైకివచ్చి) పాంచాలరాజకుమారుండగు విజయతేజుఁడనువానిని సత్యరేఖ తెచ్చి యీ మందిరమున నుంచినదని నాయనుఁగు చెలికాఁడు ప్రమాణముచేసి చెప్పుట విని దుఃఖించి వచ్చి చూచితినిగాని నా కన్నుల కెవ్వరును గానరారు. ఆహా! స్త్రీలమాయ లెంతలేసిపను లైనం జేయునుగదా! ఈ మాయలాడి కిన్నిపన్నాగము లెట్లువచ్చినవి! ఇందుకొఱకే కాఁబోలు! నాతోఁ బెండ్లియాడనని బొంకి నాకు సిగ్గు వచ్చునట్టి వేదాంతరహస్యము లుపన్యసించినది. ఒక చెంపఁ గొట్టిన పాలును, ఒక చెంపఁ గొట్టిన నీళ్ళును గాఱు నీలేఁబ్రాయపుపసికూన కీపాపవుబుద్ధు లెవరింతలో నేర్పియున్నారు? కటకటా! కాలమెంత విపరీతాకృతిం గైకొన్నది? (తలవంచి యోచించును)

సత్య:- (తనలో) ఓ భగవంతుఁడా! ఓ దీనరక్షకా! నన్నెట్లు కాపాడెదవో! నీదేభారము! ఓహృదయమా! ధైర్యమవలంబింపుము! నీవే యడలి నీరైనచో నీకెవ్వరును సహాయులుకారు.

ఉ. ఎవ్వఁడనాదిదేవుఁ? డఖి ♦ లేశ్వరు? డన్నియుఁ దానయైనవాఁ?
నెవ్వనిపూర్వ మీజగము ♦ లేవి జనింపవో? యెవ్వఁ డాఢ్యుఁ డో

డెవ్వఁడు పాంథకోటిని దయ ధేచ్ఛ దయామతిఁ గాచువాఁడు? నా
మవ్వపుజవ్వనంబు నభి ♦ మానము మానముఁ గానకుండు నే?

యక్ష:- (తనలో) ఈ యనుమానము కేవల మబద్ధ మయ్యె నేని యీ పాప మెవరితలనో పడవలసియుండును? వయోవృద్ధుఁడ నైన నాకీ దురాగతం బేమి? సద్వంశమునం గీర్తిఁ గాంచిన నాగర్భశుక్తి ముక్తాఫలమై యలరారు నాగాదిలికూతుఁపైఁ గన్న వాఁడనయ్యును నేనిట్టి నిందలు మోపుటకంటె ద్రోహ మింకేముండును? విన్నవార లేమనియెదరు? లజ్జాభీతియైన నుండవలదా? (ప్రకాశము) అమ్మా! నిన్నూరకే చూచుటకు వచ్చితిని. నీవు మఱేమనుకొనకుము! నేను వెళ్ళుచున్నాను.

సత్యా:- చిత్తము.

చేటి:- (తనలో) యీ నీళ్ళగాబు నీమహారాజునకు జూపించి యీ విజయతేజుని మట్టుపెట్టించెదను. ఆపైని మాశరద్రథుని కార్యము దానంతటదియే చక్కబడును. (యక్షునివంక దిరిగి గాబువంక కనుసైగ చేయుచున్నది.)

యక్షు:- (తనలో) ఈ చేటిక విజయతేజుఁడీ గాబునందున్నట్లు కనుసన్న చేయుచున్నది. కింపదంది యూరక పోలేదు. వలసినంతగాక కొంతయైన కారణముండక తీరదు.

తే. గీ. ఊరికే అపవాద మె ♦ వ్వారలకును
రాదు కొంచమే నట్టి కా ♦ ర్యంబు లేక
తాటికిందను పాలైన ♦ త్రాగకుండ
గల్లు త్రాగెన నెడుమాట ♦ కలుగబోదు

(ప్రకాశముగా) అమ్మాయీ! ఈ పోయిమీది గాబు నిచ్చేల ఉంచితివి.

సత్యా:- (భయముతో) నీళ్లు కాపించుటకు.

యక్షు:- మంట పెట్టించలేదేమి.

సత్యా:- లేదు. (గుండెలపై జేయిడి తనలో) అమ్మక చెల్ల! నా పుట్టు మునిగినది. నేటితో నా బ్రదుకు జెల్లినది. నా వల్లభుని కుపిత

డైన యీతఁడేమిచేసిపోవునోగదా! హా! దైవమా! ఎవరినో కాపాడుట గాదు. ఇప్పుడీ విజయతేజుని రక్షింపుము!

యక్ష:- పరిచారికా!

చేటి:- చిత్తము! దేవా! ఏమి సెలవు?

యక్ష:- కర్రలు తెమ్ము! అమ్మాయికి నీళ్లు కాపించి యియ్యవలెను.

చేటి:- అట్లే తెచ్చెదను. (అని నిష్క్రమించును)

సత్య:- తనలో నేననుకొన్నట్లే అయినది. మరికొన్ని నిమిషములలో బ్రాణత్యాగముం జేసుకొని ఈ నాథునిం గలసికొనియెదను. అంతదాక మానమును గాపాడుకొనవలెను.

ఆ. వె. పరువు పోవుకంటె ♦ మరణంబు శ్రేయంబు
మరణమన్న పెద్ద ♦ మాటగాదు
మానమున్నచాలు ♦ మాట మాణిక్యంబు
దక్క నెవరికైన ♦ నొక్కమారు.

చావునకుం దెగించియున్న నాకింక జంకెందులకు? అదిగాక భర్తతోఁ జచ్చుట పెండ్లివంటిదే కావున చింతయే లేదు కాని, ఈతఁడీ లేఁబ్రాయమున నిండుప్రాణముతో దిక్కుమాలికాలుచుఁ గడుపారఁ గన్న తలిదండ్రులను భూలోకమును దలంచుకొని యెంతయేడ్చునో? నా ప్రాణములు తల్లడిల్లుచున్నవి. హా! పాపపు దైవమా! ఈ కన్నులకెంత ఘోరకృత్యముం జూపుచుంటివిరా!

చేటి:- (ప్రవేశించి) దేవా! ఇవిగో! కాష్ఠములు.

యక్ష:- నిప్పు చేయుము.

చేటి:- (అట్లు చేయుచున్నది.)

సత్య:- (తనలో) ఆ నిప్పు నా గుండెలలో రగులుకొనుచున్నది. ఈ గాబులో నీతఁడేమాత్రము కలవరపడి రొదచేసినను, అపనిందకుఁ

దలయొగ్గవలసియుండును. కావున నన్యాపదేశముగా నా యభిప్రాయము వ్యక్తీకరించెదను. (ప్రకాశముగా)

ప. సలలితకాంతితో ముకుళ ♦ సారసమందునఁ జిక్కియున్న ని
న్నళికులవర్య! చంపకశ ♦ రాహతి మూర్ఛఁగనున్న మన్మథా
వలమును నశ్రుధారలనె ♦ యార్పవలెన్ రోదసేకుండు! నీ
చెలి చనుదెంచు నీ వెనుక ♦ చెల్వఁ వహింతువు కొంతసేపుల

యక్ష:- ఈ నీళ్లు పదిపట్లు కఱ్ఱలుగాల్చికాచి అమ్మ స్నానము చేయింపుము.

చేటి:- ఈ విష మమ్మాయికేనా?

యక్ష:- విష మనియెద నేమి?

చేటి:- విషమనిన గీర్వాణములో నీరుగాదా?

యక్ష:- (తనలో) ఇంతటితో నా కసి తీఱినదిగాని ఈ నా జన్మాంతరముదాఁక విడువనేరదు. కావున నేను రాజ్యార్హుఁడ గాను. నా భార్యయగు గాంధారి నేమొగము పెట్టుకొని చూడఁగ ఈ మార్గముననే సన్న్యసించి పోయెదను. (అని నిష్క్రమించును.)

సత్య:- హా! నా ప్రియుఁడు నిండుప్రాణముగల దేహము మండిపోవుచుండ నా పాపపు కన్నులతో నేనెట్లు చూడఁగలను? దైవమా! హతవిధీ! ఓమృత్యువా! నా ప్రాణముల ముందు గొను నన్ను నీ కత్తికి బలిచేసుకొనుము హా! (అని మూర్ఛిల్లుచున్నది.)

(తెర పడును)





శ్రీ

# మణిమాల

## పంచమాంకము

### రంగము—అరణ్యము.

(మంజువాణి కాషాయవస్త్రములతోఁ బ్రవేశించుచున్నది.)

మంజు:- విజయతేజుని పెండ్లికూఁతునకు పసపుబట్టలకు బదులుగా కాషాయ పటంబులు వచ్చినవి! హా! కాలమా! నీవేమి చేసినను చేయఁ గలవుగదా! నిన్నతిక్రమించుట కెవరితరము! ఓమానసమా! ఏల దుఃఖమునం బొరలి వగచెదవు? అయ్యో! నేనీ శోకము నెటులాఁపుకొనగలను? నన్నోదార్చు వారెవ్వరు? ఎవ్వరు శరణాగతరక్షకులు? నాఁడా స్వయంవరమున నేమైపోయిరి?

మ. అరరే! దేవతలార! నా విభుని న ♦ న్యాయంబుగాఁ బట్టి యీ
హరిణాక్షిన్ బ్రహసింపఁగాఁ దగునె? మీ ♦ రార్యుల్ కదా! తప్పులన్
గరుణింపన్ దగు లేక నావిభు జగ ♦ త్కల్యాణునిన్ గాచినన్
బరిమార్పన్ దగుఁ గాని యీదనుజభా ♦ వంబేల గైకొంటిరో!

మ. మిము వంచింపఁగ లేదు యుద్ధమునకై ♦ మీమీఁద రాలేదు ద్రో
హముసేయన్ దలపెట్టలేదు పరదా ♦ రాసక్తిఁ బోలేదు న
న్నుఁ మహావాంఛను బెండ్లియాడ సభలో ♦ మాన్యోన్నసీర్ద్ధోషు న
య్యమలాకారుని దొంగిలించుటకు మీ ♦ హస్తంబు లెట్లాడెనో?

నేనెంతటి మహాద్రోహురాలను! కటకటా! సకలపాపపరిత్యాగులైన దేవతలనుగూడ తూలనాడి పాపపుబండికి గూడట్లుకొనుచున్నాను. వారిట్టియకార్యమున కేల గడంగెదరు? ఇదియంతయు మాదాంపత్యము

జూచి సహింపనివారి యసూయావధూటి కలిపురుషాధములతోఁ బ్రసన్నమై నా యదృష్టఫలమగు విజయతేజుని మ్రింగి గుటక వేసి యుండవలెను. ఆ యమ్మవారు నన్నెన్నడును కొట్టుకొనిపోయినదికాదు. పాపులు చిరాయువులుగదా!

తే. గీ. నిండుజవ్వన మీరీతి ♦ మండిపోవ
భర్తృహీననై పాపిష్టి ♦ బ్రతుకు బ్రతుకు
కన్నఁ జచ్చుటే మేలు లే ♦ కున్న నీ శ
రీరమేల? నీ సౌందర్య ♦ భారమేల?

ఇంక నేనేమి సేయఁగలను? పతిభిక్ష మిమ్మని నేనెంత ప్రార్థించినను దయాలేశములేని యా దేవతలు మారుమాటాడక లేచిపోయినారు. పోయినఁ బోవుఁగాక నా ప్రాణవల్లభుఁడేల పోవలయును.

(అప్పుడిద్దరు చెలికత్తెలు ప్రవేశించుచున్నారు.)

ప్ర:- అక్కటా! చెలీ! మన మంజువాణి నిరంతర విరహంబున కోర్వక నిరాశంజెంది తుదకు సన్న్యసింపఁ గోరుచున్నది.

ఆ. వె. ఆటలాడ దింత ♦ యశనంబు సేయదు
పాటఁ బాడలేదు ♦ బలుకఁ బోదు
స్మరకిరాతుచేతి ♦ యురిలోనఁ బడి గిజ
గిజను గ్రాఁగుచు గజి ♦ బిజి వహించు.

ఇప్పుడే కావిబట్టలం గట్టికొని కదలి వచ్చెనని తెలిసినది. ఎట్లకేగెనో వెదకెదను. (ముందువంక మంజువాణింజూచి) చెలీ! ఏల యూరకే పిచ్చిభ్రాంతులం బెట్టుకొని దిగులొందెదవు? నీ మగఁడసహాయశూరుఁడని నీ వెఱుంగుదువుకదా ఎక్కడికేగినను వానికేమి భయము? కొన్ని దినములలో నాతఁడే వచ్చి నిన్నుఁ గలసికొనఁగలడు. నీవింట నుండుటయే యుత్తమముగాని యడవుల పాలగుట నిందలకుం బాలగుటసుమీ!

నా మాటలు మన్నింపుము. ఎప్పుడును నామాట జవదాటనిదానవు గదా. ఇప్పుడేల నాయందు గౌరవము నిల్పవు?

ద్వి:- ఇది నీకు సంగతము గాదు. తల్లీ! నామాట వినుము.

సీ. ఒంటిగాఁ బోవలే ♦ వుద్యానవనముల
కేరేతి నడవుల ♦ కేగె? దమ్మ!
వీణాధ్వనుల్ విని ♦ వెఱచెదవే! వ్యాఘ్ర
వివిధార్భటుల నెట్లు ♦ వినెద? వమ్మ?
పూలపై నడుగులు ♦ మోప కందునుగదా
చెడుముండ్లపై నెట్లు ♦ నడిచెదమ్మ?
చంద్రకాంతికి మేను ♦ చమరించి పొక్కునీ
వెండవానల నెట్టు ♦ లుండెదమ్మ?
సౌరవీథులందు ♦ శయనించు నీ వెట్లు
గిరిదరీతటముల ♦ నోరిగెదమ్మ!
అవనిరాజ్య మెల్ల ♦ ననుభవించుచు నెట్టు
లాఁకటికిని గూటి ♦ కాగె? దమ్మ!

మంజు:- నా యందుఁగల మీా స్నేహవాత్సల్య మట్లూహింపఁ జేయుచున్నది.

క. చెలులార! నుదుటలిఖితము
విలపించినయేని బోదు ♦ విధిచైదము కా
నల డాగినవార్థిని గుర్రం
గిలినను వెన్నంటుశూలి ♦ గీలికినైనన్.

ఇద్దఱు:- అటులైన నీవెంటనే మేమును వచ్చెదము మమ్ము నీగూడ తోడుకొని పొమ్ము.

మంజు:- హా! ప్రాణనాథా! నీజాడ యేమియుం దెలుపక యే కనుఁగప్పి పోయితివిగదా!

సీ. ఎండవానలకు నీ ♦ విడుములఁ బడుచుండ
మేడల నేనెట్లు ♦ మెలఁగఁగలను?
యాఁకటికిఁగూటికీ ♦ వంగలార్చుచునుండ
మృష్టాన్న మేనెట్లు ♦ మెక్కఁగలను?
గిరిదరీతటుల నీ ♦ వరుగు దేరుచునుండ
విరులపాన్పుల నెట్లు ♦ లొరుగఁగలను?
ఖగమృగాళులకీవు ♦ బెగడుచుఁ దిరుగాడఁ
జెలులతో నేనెట్లు ♦ చెలఁగఁగలను?
కడఁగి పడరాని వెత లీవు ♦ పడయు చుండ
వేడుకలవంక నే నెట్లు ♦ చూడఁ గలను?
కలలనైనను నినుఁ గాంచ ♦ గలనె నేను?
విమల సత్కీర్తి విభ్రాజ! విజయ తేజ!

ప్రభ:- అమ్మా! నీవు విచారింపవలదు. అనుంగు చెలియగు మణి మాల కలదుగదా! ఎట్లైన నామె నీ మనోరథముం దీర్పఁగలదు అడవులఁ బడిపోయిన నీకుఁ దోడ్పడువా రెవ్వరు?

మంజు:- చెలులార! నాకు దైవమే తోడు. నిర్భాగ్యనగు నాతో మీ కేమిపని?

సీ. ఘనదండకావన్య ♦ మున దవ్వు వచ్చిరి
చెలులార! గృహములఁ ♦ జేరఁబొండు!
కలుకుటామొనలపైఁ ♦ జరణంబు లెరుపెక్క
నాతోట మీరెట్లు ♦ నడువ నేల?
ఏయాశ్రమముననో ♦ యేనీడనో మృగా
వళిఁగూడి యోగము ♦ ద్రలు ధరించి
ఇడుమల సహియించి ♦ కడుగండ్లఁ బడుచుఁద
పంబొనర్చెద భగ ♦ వంతుఁగూర్చి

వాఁడు దయఁ గాంచి నాప్రాణ ♦ వల్లభు నిడె
నేని మిముఁ గూడి మీతోడ ♦ నే చరితు
నట్లు గానిచో జన్మంబు ♦ నడవులందుఁ
గడపి బ్రహ్మపదమునకు ♦ వెడలుదాన.

ద్వితీ:- అయ్యో! నీవెన్ని చెప్పినను వినకుంటివిగదా!

ఉ. అక్కట! నిన్నుఁ బాయఁగల ♦ నైన నెఱుంగ కహర్నిశంబు నీ
ప్రక్క వసించి యాడుకొను ♦ వారల మమ్ముఁ దృణీకరించి నీ
వెక్కడికేగెదమ్మ? తెరు ♦ వెక్కడ? నీ విభుఁడెడనుండునో
చక్కెరబొమ్మ? నీ చిఱుత ♦ సాహసముల్ విడుమమ్మ! నెచ్చెలీ!

మంజు:- చెలులారా! ఈ నాగమనంబునకు మీరడ్డుపడవలదు నేను పోవుచున్నాను. (రెండడుగులు నడుచును.)

చెలులు:- (తనలో) మనమెన్ని చెప్పినను ఈమె వినదు. మణిమాల చెప్పిన నెట్లుండునో?

(మణిమాల ప్రవేశించుచున్నది.)

మణి:- (తనలో) ఎంత కెంత వచ్చినది?

తే. గీ. దివిని మా సత్యరేఖచే ♦ భువిని మంజు
వాణిచేతనైనను మెప్పు ♦ పడయలేక
చెడితి తలవంపుగాదె! యె ♦ క్కడికిఁ జనిన
ననుకొనినయట్టు లయ్యె జీ ♦ వనము వనము.

ఈ మంజువాణి ప్రయాణమును వారించి నేను సమర్థించెదను.

చెలు:- చెలీ! మంజువాణి కెట్లు బుద్ధిచెప్పెదవో! ఈ ప్రయాణమునుండి మఱల్చు భారము నీతల నున్నది.

మణి:- సరే. మీయిష్టము నట్లు చేసెదను.

మంజు:- మా మణిమాల గాఁబోలును!

మణి:- అమ్మా! నేనెంత యోదార్చిన నూఱడకున్నావు. ఊరకే కాలగతికి వగచిన నేమి కార్యము? నా యాలాపములు విశ్వసింపుము.

మంజు:- నీ మధురాలాపములు సంతస ముదయింపఁజేయునేమో గాని మా విజయతేజుని దేఁగలవా?

మణి:- ఆ విజయతేజుఁడు సంతస ముదయింపఁ జేయుటకేగదా!

మంజు:- మాట బెల్లమువంటిదై నను బెల్ల మవునా?

మణి:- అవును. జేగురుగుడ్డలు సన్న్యాసిని చేయునా?

మంజు:- చేయునో! మానునో! నన్నడ్డుపెట్టక పోనిమ్మా.

మణి:- నీకింత విరక్తి కలుగుట కేమికారణము?

మంజు:- కారణమడిగిన దాని కర్థము లేదు. ఏమని చెప్పుదును.

తే. గీ. కాంచి పెంచిన పితరులు ♦ కన్నులార
చూడలేని దాంపత్యంబు ♦ బోడిపెండ్లి
వలెఁ గళాహీనమై వెల ♦ వెలను బాఱు
దొంగవాఁకిటమంచ మా ♦ దుహితబ్రతుకు.

మణి:- ఏదియెట్లున్నను పుత్రులులేని నీ తండ్రి నీచేతఁ దనరాజ్య మేలింపవలెనని యుండఁగా నీ కీయడవులఁ దిరుగుదుఃఖ మెందులకు?

మంజు:- సఖీమణీ! అటులనకుము.

తే. గీ. దుఃఖ మెవరికో వారికిఁ దోఁ ♦ చుఁగాని
శమము గలవారి కెందు గో ♦ చరముగాదు
తరువులు ఫలించువేళల ♦ విరులరాలఁ
దోఁటకాఁపరి కేటియా ♦ రాట మబల

మణి:- ఔనది నిజమేగాని ఆగర్భశ్రీమతి వగునీ వెక్కడ, కావల కేఁగుటెక్కడ?

మంజు:- చెలీ! అదికాదు.

తే. గీ. ధవుఁడు లేనట్టిసతి కేల ♦ ధరణీరాజ్య
వైభవంబులు రాజ్యవై ♦ భములొల్ల
ననెడుసతి యేమి యగును? యో ♦ గినియెగాక
కావ యోగిని నగుదు ని ♦ క్కానలోన.

మ:- వేవిపినంబులకును బోవ నవసరములేదు. నీ ప్రియుని నేఁ దోడుకొనివచ్చెదను. నీ వింటనే సుఖముగనుండుము. నాకు సెలవిమ్ము.

మంజు:- మా విజయతేజునిపై నున్న యనురాగము నన్నిట్లు మార్చినది. నేనేమి చేయుదును? నా దుఃఖము మహాసముద్రమై పొఱలు చున్నది.

సీ. చెలులతోఁగూడి బొ ♦ మ్మలనాడుటేగాని
విరహానురాగమిం ♦ తెఱుఁగనైతి
జిలిబిలిపాట ♦ కలరి పాడుటెగాని
నిరతార్తి దుఃఖమిం ♦ తెఱుఁగనైతి
స్ఫటికశిలాసౌధ ♦ పాళి నుండుటెగాని,
గిరిగుహాగమన మి ♦ ట్లెఱుఁగనైతి
రత్నాలచంద్రహా ♦ రములు దాల్పుటెగాని
వరజపమాల లి ♦ ట్లెఱుఁగనైతి

విలువగల్గినవలు ♦ వలు దాల్చుటేగాని
ఎఱ్ఱగుడ్డలింత ♦ యెఱుఁగనైతి
కావ్యనాటకాది ♦ కథలు నేర్చుటెకాని
పరమయోగినీత్వ ♦ మెఱుఁగనైతి.

మణి:- ఏమియు నెఱుంగకున్నను మూర్ఖపుపటుమాత్రము బాగుగా నెఱుంగుదువు.

మంజు:- నా మనోహరుని నేను వెదకికొనుక మూర్ఖత్వమా?

మణి:- ఆ మనోహరుని మొదట నీవే వెదకికొంటివికాఁబోలును!

మంజు.— అది నీ యనుగ్రహ మహామహిమగదా! అందు నా ప్రయోజకత్వ మేమున్నది?

మణి:— అప్పుడు లేకున్న నిప్పు డున్నటు లున్నది.

మంజు:— ఎప్పుడైన నీ యదియే భారము.

మణి:— అట్టి విశ్వాస ముండిన నే నడిగినప్పుడే నీ వేషము విడిచి నాకు సెలవొసఁగి యుందువు.

మంజు:— అయ్యో! నేనొకటి యూహించిన నొకటైనది! అక్క పోయిరమ్ము. వేగముగా రావలయును సుమీ!

మణి:— నా కార్యమునకు దైవ మనుకూలించుగాక! నీవు నీ చెలులం గలసి గృహంబునకుం బోయి సుఖంబుండుము.

(అందరును నిష్క్రమింతురు.)

## రంగము—మహారణ్యము.

(సన్న్యాసివేషముతో మణిమాల ప్రవేశించును.)

మణి:— నేను పురుషవేష మేకాక సన్న్యాసివేషముకూడ వేయ వలసి వచ్చినది ఆధారములేని నా ప్రయత్న మెట్లు కొనసాగునోగదా!

ఉ. ఎచ్చటకేగుదానను మ ♦ హీవరపుత్త్రకుఁ డేడ నుండునో?
ముచ్చటదీఱ నాచెలియ ♦ మోహము లూరఁ జరించు నెన్నఁడో
నిచ్చలు సత్యరేఖ రమ ♦ ణీమ కెన్నఁడు సిగ్గువచ్చి నా
సచ్చతురప్రవీణతయు ♦ జాణతనంబుఁ బ్రసిద్ధిఁ గాంచునో?

హా! సత్యరేఖా! ఎంతదానవైతివే! నీ వేదాంత నీతులు నిష్ప్రయోక్తములై పురుషులను దొంగిలించునంతటి దుష్టస్థితికి మాఱినవా? జగంబువిన్న నిన్నేమనును? నా మొగమెట్లు చూడఁగలవు? నీ సిగ్గును మర్యాదయు నే నేలపాలు చేసితివి? ఉత్తములైన నీతల్లిదండ్రుల నెంత క్షోభింపఁజేసితివో? రాక్షసభటులతో వచ్చి విజయతేజుని నాచికొని

మెచ్చట నుంచితివి? దేవలోకమునుండి తప్పించుకొనిపోయెనని మెఱింగి మఱుల బందిగమున నుంచవని నే నెఱుంగుదును. అయ్యో నా కాతని జాడ దెలుపు వారెవ్వరు?

ఉ. మారసమానసుందరుని ♦ మంజులగాత్రుని చారుమంజువా
ణి రమణీమనోహరుని ♦ నిర్మలచారుముఖారవిందు మం
దారలతాంతహారకలి ♦ తాంసుని బెండ్లికుమారుఁ గంటిరే
తారకలార! భాస్కరసు ♦ ధాకరదిక్కరులార! మీరిటన్?

(సాత్యవతేయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సాత్య:- ఆహా! ఏమి యీ గానమాధుర్యము! మా స్నేహితుఁడైన శరద్రథుని జూచుటకై గగనవీధి నంటిపోవుచున్న నన్ను లాగి కొని వచ్చినది!

మణి:- ఎవ్వరో యీ వనమున కరుదెంచినట్లు సందడి యగుచున్నది. నా వీణాతంత్రుల మేళనము చేసికొని కొంతసేపు పాడుచు భగవంతుని ధ్యానము చేసికొనుచుండెదను.

క్రౌంచపదవృత్తము.

ఆర్తశరణ్యా! హా! పరమేశా! ♦ యహరహమును ♦ భవ దభినవలీలల్
కీర్తులొసంగుఁ గోర్కెలనించుఁ ♦ క్షితిభర మణఁచి ని ♦ ఖిలమును
బ్రోచుఁ
కర్తవు నీభూభర్తవు నీవే ♦ గతిఁ దలఁచిన నగుఁ ♦ గలుగు జగా! నీ
వర్తన మేయోగీంద్రుఁ డెఱుంగుఁ ♦ బరమపురుష! భవ! ♦ వరద!
మహాత్మా!

సాత్య:- అయ్యారే! ఏమాకలకంఠకంఠము!సుధాతరంగములవలె నెంత యింపు నింపుచున్నది!

శా. వీణానిస్వనపూరపూరితకళా ♦ విఖ్యాతమాధుర్య మా
గానం బాస్వరసాహితీమహిమ మే ♦ గంధర్వ నారీమణీ

గానంబో యుగుఁ గాని జాలను గరం ♦ గం జేయుచున్ హాయిగా
వీనుల్ నింపి వియత్పథశ్రమమునన్ ♦ విశ్రాంతి గావించు నే?

ఈ గాయనీమణి మా మణిమాలయే యైనచో నా చెలువంబు గోరి నాకెంత హితమాచరించి విరహము చల్లార్చి యుండునో కదా! అంత యోగ మెవరికి పట్టును? దగ్గఱ కేగి పరికించెదను (ముందుకుఁ జని) ఓహో!

సీ. ఒక చేతవీణె వే ♦ ఱొక చేత బోలె ని,
భూతి మై నలదినఁ ♦ బూచివాఁడు
ఒకవంకఁ గకపాల ♦ యొకవంక జపమాల,
లత్యంతకాంతి నొ ♦ ప్పారువాఁడు
ఒకచెంత దండంబు ♦ నొక చెంతఁ బూజాప,
సూనపత్రంబులఁ ♦ బూనువాఁడు
ఒకచోఁ గురుల్ వ్రేల ♦ నొకచో సరుల్ ,
గ్రాలకల్యాణగుణములు ♦ గలుగువాఁడు
కలితకాషాయవస్త్రముల్ కాంతు లీన
సహజవైరాగ్యమునఁ దోఁచుఁ ♦ మహితమూర్తి
సిద్ధుఁడో? యతిలోక ప్ర ♦ సిద్ధుఁడో? మ
హాత్ముఁడితని దర్శించి కృ ♦ తార్థుఁ డగుదు.

(అని దగ్గఱకుం బోవుచున్నాఁడు)

మణి:- (తనలో) ఆహా! నావలపుకాఁడు సాత్యవతేయుఁడు వచ్చియున్నాఁడు. నాపట్టుదల తుదముట్టువఱకుఁ బెండ్లియాడనని కృతనిశ్చయురాలనైయున్న నే నీతని నెట్లు చెట్టఁబట్టవలయును? ఎట్లో తప్పించుకొనియెదను.

సాత్య:- సంయమీంద్రా! జోహారు!

మణి:- కల్యాణమస్తు! నీవిట కేల వచ్చితివి?

సాత్య:- మునివర్యా!

చ. నిలిచినక్రొమ్మెఱుంగువలె ♦ నిద్దపుకాంతుల నీనుదేహమున్
గలకలలాడు నీమొగముఁ ♦ గాంచుట నీహిత మాచరింపఁగాఁ
గలఁచి భవత్పదాబ్జముల ♦ దర్శనమున్ బొనరించినాఁడ నీ
చెలువుఁడ నంచు నెంచుకొని ♦ చేరఁగ రమ్ము మదీయగేహమున్.

మణి:- (తనలో) అక్కటా! కార్యార్థిని నగు నే నీసమయమున నావలపుకాని బరుషోక్తు లాడి నావేషమును సార్థకపరచుకొనవలసి వచ్చినది. (ప్రకాశము) అరే ఏమనుచున్నావు? నీ కేమియుఁ దారతమ్య పరిజ్ఞానము లేదా? మే మెంతచులకనగానైతిమి!

మ. ఎకసక్కెంబులె? నవ్వులే? చెలిమి మా ♦ కేలా? యకే! మూఢ! నీ
విఁక మా శాపశరాహతిన్ మడియున ♦ ద్దేస్నేహమూహింతువో?
అకటా! మాకును నీకు హస్తిమశక ♦ న్యాయంబు గాదొక్కో మ
క్షిక మగ్నిన్, శలభంబు దీపకళికన్ ♦ జేరంగ రావచ్చునే?

సాత్య:- (తనలో) సర్వజ్ఞుఁడైన యీ మహర్షి కామాసక్తమైన నా యాంతర్యముంగనియే యాగ్రహించుచున్నాఁడు. (ప్రకాశము) ఋషిసత్తమా! ఆగ్రహింపకుము నేను గంధర్వ రాజకుమారుఁడనగు సాత్యవతేయుఁడను. మీవంటి మహానుభావులను సేవింప నీ యరణ్యాని కరుగుదెంచి నా పురాకృతసుకృతపరిపాకవశమున మిమ్ముఁ గాంచఁగలిగి కృతార్థుఁడనైతిని. నాయం దవ్యాజవాత్సల్యంబునఁ గృపచేసి మా గృహము పావనముసేయ నీ యానంబున నరుదెంచి నన్ను ధన్యునిం జేయుఁడు. మీ సేవారతి నిరంతరము మీ సన్నిధిని వర్తించెదను.

మణి:- మా సేవ వలన నీ కేమి ప్రయోజనము?

సాత్య:- భవదీయచరణపంకజపరిచర్యాచరణసంప్రాప్తి యనంత ప్రయోజనముగదా! అంతకంటె నీదేహధారి కేమికావలెను? (తనలో) ఈతఁడు తపసివేషగాని వైఖరి మా మణిమాలం బోలియున్నాఁడు.

యోగులనట్టి దోషైకదృక్కులంజూడఁదగదు. కాని యింటికిం గొని పోయి మా మణిమాలకు బదులుగా వీనింజూచి సంతోషించుచుండెదను భార్యయగు మణిమాల నన్ను పూజింపవలసియుండఁగా శిష్యుఁడనై నేనే పూజింపవలసివచ్చినది!

మణి:- స్వగౌరవ స్వాతిశయగర్వాతిరేకంబున మత్తులైన మీతో మాకేమిపని? మా నీడనుజూచి మేము కంపించు యోగధనులము. ధనమదాంధులకెట్లు పూజనీయుల మయ్యెదము? మమ్ముఁజూచి వారసహ్యపడి దూషించెదరు. కావున నే యడవుల నుండవలసివచ్చినది.

తే. గీ. పరుల కేరికిఁ గలనైన ♦ నెఱుఁగరాక
కాననాంతరసీమలఁ ♦ గందమూల
ములు భుజించుచు నుండుమా ♦ బోంట్లు, గుహల
నుండు సాధుమృగంబులు ♦ నొకటిగాదె?

సాత్య:- పడరానికష్టములకీలీలఁదలనిచ్చి యహోరాత్రము లుపవాసవ్రతమాఘులంగీలించుచు నిద్రావస్థలమాని కానలవర్తించుటకంటె సుమాళముగా మదీయ రాజ్యభారమును వహించి మహావైభవముతో నీ లేఁబ్రాయమును సార్థకపరచుకొనుము. నీకు నేను సదా ధ్యానము చేయుచుండెదను.

మణి:- వెఱ్ఱివాఁడా! మాకు రాజ్యపాలనము కావలయుననిన నీవలెనా? ఈ చతురుదధిపరీతమహీతల మేకచ్ఛత్రముగాఁ బాలింపవలెననిన మాకు లేదా?

ఉ. శాత్రవులన్ జయించుటకు ♦ శస్త్రము శాస్త్రము దోర్బలంబునన్
క్షాత్రము, మాయధీనము ని ♦ జంబుగ లోకము నేలుబుద్ధి యే
మాత్రము కల్గినన్ విమత ♦ మండలి మమ్మెదిరించి నిల్చునే?
మిత్రుఁడ! యిట్టి తుచ్ఛమగు ♦ మేదినియేటికి? రాజ్యమేటికిన్?

అదిగాక పశుపక్షిమృగాదితిర్యగ్జంతువులు మా యాజ్ఞానుసారము పరిచర్యలు చేయుచుండఁగా నది రాజ్యము గాదా? విషయాసక్త ప్రపంచముతో మా కేమిపని?

సాత్య:- అయినను నిరుపమానసౌందర్యకళాకోవిదుండవైన నీ కవశ్యము రాజ్యభారమే యుండవలయుంగాని యోగభార ముండవలసినదికాదు.

తే. గీ. నిండుసౌందర్యమునఁ దూఁగు ♦ చుండునీకు
పాడువైరాగ్యమేటికి ♦ పరిఢవిల్లె
కలితఘనసారతరువుపై ♦ గచ్ఛడోంక
యలముకొని రూపుమాపి న ♦ ట్లయ్యె నయ్యొ?

మణి:- ఓగంధర్వవతంసమా! నీ వింకను మందప్రజ్ఞుఁడవు. సర్వక్రియావిరహితులమై సన్న్యాసుల మగుమాకు వైరాగ్యమేసౌందర్యము. నినుఁ జూచి యింతవఱకైన మాట లాడితిమిగాని లేనిచో మా కేమి గావలయును? ఇవస్నియుం జూడుము. ఈవనమే మాకు శయనాశనవిహారముల కిరవైనస్థానము.

సాత్య:- ఈళ్లు రప్పలు తప్ప నిచట మతే మున్నవి?

మణి:- వెఱ్ఱివాఁడా! బాగుగఁ బరికింపుము

సీ. వరసరోవరమనో ♦ హరమహాటవి విహా,
రార్థమై యుండ ను ♦ ద్యాన మేల?
గిరిదరీకుహరముల్ ♦ తరులనీడలు నివా,
సార్థమై యుండ గృ ♦ హంబు లేల?
చిగురాకుపాన్పు నిం ♦ పగు పూఁబొదలు శయ,
నార్థమై యుండఁ బ ♦ ర్యంక మేల?
ముద మొదవంగఁ దు ♦ మ్మెదలు పాడుచు సహా,
యార్థమై యుండ మి ♦ త్రాళు లేల?

పక్షులొక్కవంక ♦ ఫలరసంబు లొసంగ
నారగించు చుండ ♦ నన్ను మేల?
సకలవిభవ మిచ్చు ♦ సర్వేశ్వరుం డుండ
భోగభాగ్య మేల ♦ జోగులకును.

సాత్య - (తనలో) ఈతని వేషమేగాక శృంగారమైన ఖరీపూంతి వచనంబులుకూడఁ గపటసన్న్యాసియని చెప్పక చెప్పుచున్నవి. కావున నేనున్నన్న యోగివలె దంభములు పలికి బెదరించినాఁడు. ఈతఁడు శాపానుగ్రహసమర్థుఁడు కాకపోవచ్చును. యుక్తముగాఁ గడిపి నాఁచెదను. (ప్రకాశము) స్వామీ! తామన్నది వాస్తవమే, నాసంశయములు నివారించి నాతప్పు మన్నింపుము.

మణి:- తత్త్వమునం దేసంశయము లున్నను దెలుపుము. అవశ్యము వారించెదను.

సాత్య:- తత్ × త్వం = అదేనీవు. అనగా ఆ మణిమాలయే నీవు. ఆ సంశయమే నాకు నివారింపవలయును.

మణి:- (తనలో) నన్నీతఁ డానవాలుపట్టెనా యేమి? అహా! ప్రమాదము వచ్చినదే! ఎటులయినను మఱపించెదను. (ప్రకాశముగా) నీవు మణిమాల యను నారీమణిని కామించినట్లున్నావు. నీ యువతి మంతియు మా కెఱుంగవచ్చినది.

సాత్య:- యతీశ్వరా! సర్వజ్ఞులైన తమ రెఱుంగని యర్థ మేమున్నది? నాకభలపాటును బోఁగొట్టు నుపాయ మెఱింగింపుఁడు. మీ దాసుఁడనై మీయాజ్ఞను సేవకావృత్తి సలిపెదను.

మ:- సరే! నీ సంశయము లేవియో వచింపుము. భయము లేదు

సాత్య:- (తనలో) వీనిని జూచిన మణిమాలను జూచినట్లు నావిరహ ముపశమించి నవీనానందము వొడమి శరీరము గగుర్పొడుచుచున్నది. ఒకసారి కౌఁగలించుకొందునా? (ప్రకాశము) హా! ప్రాణేశ్వరీ!

మణిమాలా! నన్నేల యడియాస పెట్టి చిక్కులం ద్రోసెదవు? సన్నిట నీభుజలగాయుగ్మమునంగట్టివేయుము. (అని కౌఁగిలింపఁబోవును)

మణి:- ఆఁ! ఆఁ! ఆగు మాగుము! మావంటి ఋషిసత్తములపై నీ కామవికారములు చూపవచ్చునా? చూడుము! ఇదిగో! ఇప్పుడే మా శాపాహతిని నిన్ను మాడ్చివేసెదను.

సాత్య:- (నిర్విణ్ణుఁడై నిలువఁబడును)

మణి:- (తనలో) హా! ప్రాణేశ్వరా! నాయం దెంత యనురాగ వంతుఁడవై పరితపించుచుంటివో! హా! నీతల్లడపాటు కన్నులారఁ జూచియు మాయలాడి తప్పించుకొని నిన్నాదరింపక యెంత పాపముం గట్టుకొనిచుంటిని! (కన్నీరునించి) చిత్తమా! శాంతింపుము. నీపట్టుదలయే యిట్లు కట్టికుడుపుచున్నది. (ప్రకాశముగా) చూడుమిదిగో! మాశాపము నిన్ను దహించివేయును.

సాత్య:- (దైన్యముతో) నీవు మామణిమాలవు కావా?

మణి:- (తనలో) కాననుటకు నోరాడకున్నది. (ప్రకాశము) అటులైన యోగినెట్లయ్యెదను?

సాత్య:- అవును. నిజముగా యోగివి కావు.

మణి:- ఎట్లు కాను?

సాత్య:- కానట్లే కావు.

సీ. కురుల రాచిన నూనె ♦ మెరుగు పోలే దింక
జడ ల్లుల్లుకొని తల ♦ చెడఁగ లేదు
కాషాయవస్త్రమిం ♦ కను మాయఁగా లేదు
వదనసరోజంబు ♦ వాడ లేదు
కనుఁదమ్ములను గ్రాలు ♦ కాటుక పోలేదు
కస్తూరితిలకంబు ♦ కరఁగ లేదు
విడెముచే నెర్రనౌ ♦ పెదవి మాయఁగ లేదు
చందనగంధంబు ♦ జాఱ లేదు

భోగములు నీమనోవీథిఁ ♦ దూఁగుచుండ
త్రోడరి జడదారి వని యింత ♦ తోఁచరావు
దాఁప నేటికి? నీవాఁడ ♦ దయఁ దలంచి
నీదు తొలిరూపు జూపు! మా ♦ మోద మెసఁగ

మణి:- మణిమాలయందు బద్ధానురాగుండవై తత్కాంతా సందర్శనాయత్తచిత్తుండవై సంచరించునీకు ఎవ్వరుగానుపించినను మణిమాలవలెనే తోఁచెదరు కామాధీనమానసులకిది సహజముగదా!

సాత్య:- నన్నేల విభ్రాంతుని జేసెదవు? నీకేమి యపకార మొనరించితిని? నిన్ను మనసారఁ గామించి నీకై విలపించుచున్న నన్ను నిజనాడి యిట్లుండుట తగునా? తుదకు నా బ్రతుకు శరదభ్రఘనికంబె నన్యాయము చేయఁదలంచితివా? నన్ననుగ్రహించి కృతార్థుం జేయుము. నీ ప్రచ్ఛన్నవేషము లిక చాలించి నా యింటికిం దయచేయుము.

మణి:- (తనలో) అన్యోన్యానురాగముగల మేమిరువుర మొక్కచోఁ గలిసియు సంపూర్ణ మనోరథులము కాలేకపోవుచున్నాము! నా కార్యము సిద్ధించువరకు నా కుహనాయోగిత్వము నెరపుచు నీతనికడనే యుండెదను. (ప్రకాశము) పాపము నీకెంత పిచ్చిపట్టినది! ఎట్టివాఁడ వెంత త్వరలో మాఱిపోయితివి!

ఉ. దారువు పూరుషంబలె ను ♦ దారమరీచిక పల్వలంబులా
గారయఁ దోఁచు; శుక్తి రజ ♦ తాకృతి; రజ్జువు సర్పమట్లు క
ప్పూరము క్షారరీతి నను ♦ రూపములై కనవచ్చినట్లు నీ
కోరినకాంతభంగిఁ గను ♦ గొందువు చూచినదెల్లఁ గామివై.

సాత్య:- ఇంతసేపటికి కోమలినని సూచించితివి. ఇదియేచాలును. నీకే యపకార మొనరించితిని? నన్నుఁ బెండ్లియాడెదనని ప్రమాణాము చేసి నన్ను విడిచి యీలీల నడవులం జరింప నేల తలఁచితివి? తుదకు నా బ్రతుకు నిరర్థకమేనా?

మణి:- రాజా! నీవాతురపడకుము. నీ మణిమాలను నేము దివ్యదృష్టినిజూచి మాయాగవిద్యాచ్ఛక్తిని రావించి నీ కానందముం గూర్చెదము మమ్మాశ్రయించినవారు విఫల మనోరథులై చెడరుగదా!

ఉ. వ్యర్థమనోరథత్వ మెటు ♦ వంటి గుణాఢ్యునినైన దుఃఖ సం
వర్థితజీవనాథ్యుగ న ♦ వశ్యముఁ జేయు, విషాభమై మహా
నర్థమొదర్చు; వానికి స ♦ హాయుఁడు గాఁడె భువిన్ "బరోపకా
రార్థమిదంశరీర" మను ♦ నార్యపదైక హితానువర్తి దాన్?

ఇదిగో! ఈధరాధరపరిసరారణ్యముం జూడుము. నీ విభ్రాంత మనోజవికారము నశించి సుఖించెదవు.

సీ. చెలులతోఁదోడినె ♦ చ్చెలులతోఁ జెలువొప్ప
విదివాణి వీణవా ♦ యించుచోటు
జవముతో వరతపో ♦ జ్జ్వలతతో శర్వాణి
యర్థాంగలక్ష్మియై ♦ నట్టిచోటు
రతితోడఁ గడు మహా ♦ రతితోడ విహరించు
నతనుఁడు హతమారి ♦ నట్టిచోటు
సరససల్లాపహ ♦ ర్ష విలాసముల మరు
చ్చంచలేక్షణాలు క్రీ ♦ డించుచోటు

మహితమాణిక్య నవరత్న ♦ మండపముల
నిండికర్పూరదీపముల్ ♦ నెగడుచోటు
అన్ని చోటుల కిది ముఖ్య ♦ మైనచోటు
ఆటకత్తెల కిది యిర ♦ వైనచోటు

ఇంకను అనేక చిత్రములు కలవు. రమ్ము చూపెదను.

సాత్య:- నీకంటె చిత్ర మేముండును? నీవే నాకొక యైంద్రజాలము.

మణి:- (స్వగతము) ఈతని మరియొక ధోరణిలోనికి దింపవలయును. (ప్రకాశము) సాత్యవతేయా! అదే చూడుము.

చ. కడువడి ఱెక్క లార్చుచు ఖగంబులు గూండ్లను దూఱెఁ; గేకినుల్
తడఁబడి పింఛముల్ ముసుఁగు దాల్చె; మరాళము లబ్జపంక్తిమాటిడికొనె; చెట్లనీడ గమ నేచ్చను వీడి మొదళ్ళఁ జేరె; నీ
యెడ నడిమింట సూర్యుఁడు న దే!చను దెంచెఁ బ్రతాపమూర్తియై
కావున మధ్యాహ్నమైనది. మనమాదరులనీడకు బోవుదముఱమ్ము.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

## రంగము—పురవీధి.

(పౌరదత్తుఁడు ప్రవేశించి యుండును.)

పౌర:- మా చెలియైన కురంగిని దేవనగరమునుండి నేఁడేమోగాని యింకను రాదయ్యెను. నియమితకాల మతిక్రమించినది. భాస్కరుఁడు తల కెక్కియున్నాఁడు మలయానిలుం డంతకంతకుఁ దీక్ష్ణతను జూపుచున్నాఁడు పెనుధూళి రేగుచున్నది.

కం. లోకము తలక్రిందైన సు
ధాకరభాస్కరులు దారి తప్పిన దిక్కుల్
చీకాకుపడిన మా చెలి
రాకకు నెదు రుండరాదు రాలే దింకన్.

(శ్రవణ మభినయించి) అహో! ఏదియో కలకంఠకంఠి చల్లని కంఠస్వరమును సూచించుచు గానరససుధాసేచనమున వీనులకు విందొనరించుచున్నది? అది మా చెలిగాక మఱెవ్వరు? (రెండడుగులు నడచి) ఈమె నేఁ డతివినోదవతియై నవీనాలంకారభూషితయై ఒయ్యారంబునఁ దూఁగుచు రాగంబుల జోగుచు గగనయానంబున విరవీఁగుచు నదిగో!

సీ. కీరవారసువాణి ♦ గీర్వాణవాణిని
గీర్వాణి వీణను ♦ గేలఁబూని
స్వరసుధాధారలే ♦ పార మంజులగాన
పారీణమై సువ ♦ ర్వాణచారు
సందేశహారియై ♦ సాంద్రశరత్కాల
చంద్రచంద్రికవలె ♦ జాడ దోఁప
వికసితవదనార ♦ విందంబుతో మేని
చందన గంధంబు ♦ చదలఁ బర్వ

నగవు మొలక లెత్త ♦ నలుదెసల్ చూచుచుఁ
గమ్రకంకణములు ♦ గల్లుగల్లు
మనుచు మ్రోయుచుండఁ ♦ జనుదెంచె గజయాన
గగనయాన యగుచుఁ ♦ గాంతు లీన.

(కురంగిని ప్రవేశించుచున్నది.)

కురం:- (తనలో) ఓహో! నా చెలికాఁడగు పౌరదత్తుఁ డిక్క డనే నా కొఱకు వేచియున్నాఁడు! (ప్రకాశము) మిత్రమా! కుశలమా?

పౌర:- (ఆనందముతో) చెలీ! గతశ్రమురాలవై నీ సందేశమును మనోహరముగా వచించి నన్నుఁ గృతార్థునిం జేయుము. నీ కొరకు నిరీక్షింపఁగా కాయలుకాచిన నా కన్నులు నేఁడు జగా! ఫలించినవి.

కుర:- నాయందు నీకుఁగల వాత్సల్యమట్లు తోఁపించి యుండ వచ్చును.

పౌర:- ఎన్నఁడు లేని యాలస్యము చేయుట కీనాఁడు కేమి యడ్డము వచ్చినది?

కురం:- పురందరాదిబృందారకలోక మీవేళఁ గోలాహల మైయున్నది.

పౌర:- అజరామరమైన దేవాన్వయమున కంతటి మహాక్షోభ ముద యించుట కేదేని రాక్షసకలహము సమకూడెనా యేమి?

కురం:- లేదు.

పౌర:- మఱియేమి కారణము?

కురం:- సత్యరేఖ గుట్టు బయలఁ బడినది.

పౌర:- పాప మెంతపని జరిగినది! తరువాత!

కురం:- విజయతేజుఁడు కృత్రిమస్నేహితుఁడని సత్యరేఖహృదయ క్షేత్రమున నేఁడు దృఢముగా నెలకొల్పఁబడినది.

పౌర:- అదియెట్లు?

కురం:- విజయతేజుని మొదటి వైరాగ్యతూలము మంజువాణీ కటాక్షాగ్నిచే దహింపఁబడుట నీవెఱుంగుదువుగదా.

పౌర - అవును. లోభియగు ధనవంతుఁడు దరిద్రుఁడ నని చెప్పు కొనినట్లు మోహాసక్తుఁడును విషయాభిలాషుఁడైన విజయతేజుఁడు వేదాంతోపన్యాసములు చేసి తన వ్రతము వెల్లడించెనుగాని అట్లు నిలచునా?

కురం:- సత్యరేఖ మొదట మణిమాలతో నింతకంటె మృదువైన వైరాగ్య వ్రతనీతులతోఁ దన పాండిత్యమును వెల్లడించినదే! తుదకు వారి విరోధమే యీ నాటక మాడించుచున్నది. సుద్దులు చెప్పినట్లు చేయజాలరుగదా?

పౌర:- ఎంత నిష్కాములకైన వనితాచందన విషయభోగాపేక్ష వదలుట కడు దుర్లభము. అనన్యసామాన్యము. తరువాత యేమైనది?

కురం:- నాకు ప్రాణము లర్పించి శరద్రథుఁడు బావయై యుండఁగాఁ గుపితుండైన విజయతేజుని వరించి కులము వేఱుచేయుటకు యత్నించిన నేనెంతయు ద్రోహురాల ననుదుఃఖము కడుపునఁ బెట్టు కొని చచ్చి పడియున్న శరద్రథుని బ్రతికించినఁగాని తాను నురిపెట్టు

కొనెద నని ఘోరముగా నేడ్చుచున్న సత్యరేఖను దేవతలందఱు నూరార్ప లేకున్నారు.

పౌ:- శరద్రథున కెంతటి మహాకష్టము సంభవించినది? అతఁడిప్పు డెటున్నాఁడు?

కురం:- పదిపుట్లకర్రల పోయిక్రింద మండఁబెట్టిరి. అంతవరకు నతఁడా కుండలోనే మఱుఁగుచున్నాఁడు. తరువాత చచ్చిన విజయతేజుని కన్నులతోనైనఁ జూచి శిరచ్ఛేదముం జేసికొనెదనని సత్యరేఖ మూఁతఁదీసి చూడఁగా శరద్రథుఁడు కానవచ్చెను. అప్పుడామె దుఃఖము మఱింతలావై మోసము చేసిన విజయతేజునినుండి యామెను మరలించి శరద్రథునింగూర్చి ఘోషింపఁజేయుచున్నది.

పౌర:- ఎంతకష్ట మెంతకష్టము!

కురం:- వారి కది కష్టమే కాదు.

పౌర:- చావుకంటె కష్టమేమున్నది?

కురం:- అందఱకుఁ దెగించినవారే పూనికొనెదరు.

పౌర:- అట్లయిన విజయతేజుని గతి యేమైనది?

కురం:- వాని కేమి? నారదముని యాశ్రమమున నున్నాఁడు.

పౌర:- ఎట్లు రాఁగలిగెను?

కురం:- నారదముని ప్రార్థింపఁగా దోడుకొనివచ్చెను.

పౌర:- చెలీ! శరద్రథుఁడు నిజముగాఁ జచ్చియే పోయెనా?

కురం:- చచ్చిపోయెను గాని జీవనమున్న దనియెదరు.

పౌర:- అంతటి మహాగ్నిహోత్రము నెటులజయింపఁగలిగినాఁడో? వాఁడొక తపశ్శాలియునుగాఁడే!

కురం:- కామియుఁ దపశ్శాలివంటివాఁడే.

పౌర:- అగ్ని యేల మండించినది కాదు?

కురం:- సత్యరేఖకుఁ దనవలన నేదేని యుపాయము వచ్చునను

చింతచేఁ గాబోలును శరదగ్ధుఁడు కన్నీళ్లను గార్చుచు నగ్నిహోత్రము నార్పుకొనెను!

పౌర:- అప్పుడా రోదనధ్వని దిశాభాగంబులఁ బిక్కటిల్లెను కాఁబోలును!

కురం:- ధ్వనిచేయవలదని సత్యరేఖ అన్యాపదేశముగాఁ జెప్పుటచే నాతఁడు కిక్కురుమనలేదు.

పౌర:- విరహులన్న వారందఱు నట్లు సహించెదరా?

కురం:- నిజమైన విరహము కావలెను. అట్టివాఁడు,

తే. గీ. కాంత లభియించువాంఛ ర ♦ వ్వంత యున్న
కామికిని నిప్పు నీరన్న ♦ నేమిలెక్క?
అగ్నిహోత్రంబు కన్నీళ్ల ♦ నార్పుకొనుచు
ప్రాణముల నిల్పఁడే? శర ♦ దగ్ధుఁడు చూడు!

పౌర:- తరువాత నేమైనది?

కురం:- ఈవార్త యానోట నానోట దేవలోక మంతటను దృటి కాలములోఁ దాటి యాకింటికి నిప్పు ముట్టినట్లు వ్యాపించినది.

పౌర:- చాలమంది వార్తాపత్రికలవంటివారు జీతబత్తెములు లేకయే వార్తలు వ్యాపింపఁజేసెదరు. తరువాత!

కురం:- అప్పుడు దేవేంద్రాది దిక్పతులు, అశ్వినీ దేవతలు, బృహస్పతి మొదలగు ఋషులతో నచ్చోటి కరుదెంచియున్నారు.

పౌర:- పాప మాసత్యరేఖ నేమిచేసి పోదురోగదా!

కురం:- సత్యరేఖ యేమిచేసినది? ఆతఁడే విజయతేజుఁడైనయెడల నేమైనఁ గీడువచ్చును.

పౌర:- ఏదియెట్లుకానున్నదో?

ఆ. వె. ఒకఁడు తప్పుసేయ ♦ నొకనికి ముప్పగు
తా నొకండు దలఁప ♦ దైవ మొకటి

తలఁచు; నేది విధివి ♦ ధాన మెఱుఁగరాదు
కాల మొక్కరితిఁ ♦ గడవఁబోదు.

కురం:- దేవేంద్రుఁడు సత్యరేఖపై దయగలవాఁడు గావున నెట్లైన శరద్రథుని బ్రతికించుటకు బ్రయత్నించును. మనమాముచ్చట చూడఁబోవుదము రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)





శ్రీ

# మ ణి మా ల

## ష ష్ఠాం క ము.

### రంగము - నారదాశ్రమప్రాంతము.

(విజయతేజుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విజ:- అఖిలతత్త్వవిశారదుఁడైన నారదమహాముని యనుగ్రహమున సత్యలోకముం దప్పించుకొని భువికి వచ్చి మా మంజువాణి భవనమునకుం బోయితినిగాని, ఆ మనోహరాంగి నన్ను వెదకికొనుచు నడవులంబడి పోయెనఁట! ఈ యడవులన్నియు వెదకితిని గాని యెక్కడను గానరాదు. హా! దైవమా! నన్నేల పుట్టించితివి?

తే. గీ. తల్లిదండ్రులు పెంచువా ♦ రెల్ల విడిరి
ప్రాణ మిడి వరించిన పుణ్య ♦ వనిత పీడె
దివి వసింప వీడె సుఖాప్తి ♦ భువిని వీడె
నొంటిబ్రతు కయ్యెఁ గలఁడె నా ♦ వంటివాఁడు?

హా! దైవమా! నే నేమిచేయ సమర్థుఁడను? హా! ప్రాణేశ్వరీ! హా! మదగజయానా! ఏయానంబునఁ బయనం బైతివో?

సీ. చెలులందుఁ దనయందుఁ ♦ జెలిమిచే సమబుద్ధి
నరయుచుండెడి సుగు ♦ ణాలవాల!
రాజపుత్త్రి నటంచు ♦ రాజసంబున విర్ర
వీగఁబోవని పుణ్య ♦ విమలచరిత!
అందకత్తె నటంచు ♦ నతిశయాన్వితదృష్టి
కలిగించుకొననట్టి ♦ కలితశీల!

మతిలోన నెట్టి సం ♦ గతిలోన నొక్కింత
యాడితప్పని వర ♦ హాలమూటు.

చదువు నేర్చి చాల ♦ సద్గుణంబులు నేర్చి
పరుస మెరగనట్టి ♦ పరమసాధ్వి!
నిన్నుఁ దలఁచికొనిన ♦ నిదుర కంటికిరాదు
మంజువాణి! సొగసు మంజువాణి!

ఆ. వె. అమృత సదృశమైన ♦ యట్టికళ్యాణి! క
ల్యాణగుణము లెంత ♦ కైనఁగాని
మఱపురావు; నిన్ను మర పొందు టెట్టులో
మంజువాణి! సొగసు ♦ మంజువాణి!

ఉ. ఎందు వసించియుంటివోకో? ♦ యేమని నీమది నెంచుకొంటివో?
చందనగంధి! యోర్వని వి ♦ చారముతో ననుఁ బిల్చి యేడ్చుచున్
చందనమల్లి కాలతల ♦ చాటున డాఁగుచు క్షుత్పిపాస తే
చందము నోర్చితో? బహుళ ♦ చంద్రునిబోలెఁ గృశించిపోవుచున్.

ఉ. ఇందునిభాస్యమైన సతి ♦ నెందునఁ గంటిరే? పుల్లమల్లికా
చందనమాలతీతరణి ♦ చంపకవల్లి కలార! చారుమా
కందములార! మత్త గజ ♦ ఖడ్గమృగావళులార! శారికా
బృందములార! పెంపలరు ♦ భృంగమయూరములార! మీరిటన్.

సీ. కలకంఠులార! మా ♦ కలకంఠకంఠిని
దాఁచిరే పలుకులఁ ♦ జూచి మీరు?
రాయంచలార! మా ♦ రాజీవనేత్రను
దాఁచిరే గమనంబుఁ ♦ జూచి మీరు?
భృంగంబులార! మా ♦ బంగారుబొమ్మను
దాఁచిరే నెఱివేణిఁ ♦ జూచి మీరు?
పూఁబోదలార! మా ♦ పూర్ణేందువదనను
దాఁచిరే మెయితావిఁ ♦ జూచిమీరు?

హారిణకుణకంబులార! మా ♦ యంబుజాక్షి
దాఁచిరే వీక్షణంబులఁ ♦ జూచి మీరు?
తగదు! మర్యాదగాదు! మా ♦ మగువ మంజు
వాణి నియ్యరే? మ్రొక్కి మీ ♦ వాఁడ నగుదు.

సీ. వెదకిరే? మాకాంత ♦ వెడలినజాడలు
నగములార! యరణ్య! యరణ్య ♦ మృగములార!
చూచిరే? మాచెలి ♦ చొచ్చినచోటులు
సరసులార! మయూర ♦ తరుణులార!
నుడువరే? మాసాధ్వి ♦ నడచినత్రోవలు
కరిణులార! మరాళ ♦ గరితలార!
తెలుపరే? మాలేమ ♦ పలికిన పలుకులు
చిలుకలార! చకోర ♦ కలుకులార!

వింటిరే మా సరోజాక్షి ♦ వెతలు మీరు?
ఖగములార! రథాంగ ప ♦ న్నగములార!
కోకిలములార! పుణ్యంబు ♦ కొరకునైన
మా సఖీమణి నియ్యరే? మాన్యులార!

అయ్యో! నే నెక్కడ? ఎక్కడ? మంజువాణి? ఇవి యన్నియు వృథాలాపములుగావా? ఆనాఁడొక్క గడియ చూచుకొనుటకుమాత్రము ఋణమున్నది. రెండవది పూలహారము. నా ప్రియురాలిపటము వ్రాసి నేనచట దాసునివలె లిఖించుకొనెదను. (అని పటముపై వ్రాయుట నభినయించుచున్నాఁడు.)

(అంతట దేవమాత ప్రవేశించుచున్నాఁడు)

దేవ:-విజయతేజుని దోడుకొని రమ్మనిన దేవేంద్రుని యాజ్ఞానుసారముగా నాతఁ డుండుననుచోటు లన్నియుం జూచితినిగాని యెందును గానరాలేదు. కాని, చెలులతో నొకలేఁబ్రాయపు ముద్దరాలు విజయ

తేజుని బ్రార్థించుచు దుఃఖముతో నలసగమనయై పోవుట చూచితిని ఇఁక నెట్లు నా కాతనిజాడ తెలియఁగలదు? ఎట్లు పట్టుకొనఁగలను?

విజ:- హా! స్వభావమా! ఓకాలమా! మిమ్మతిక్రమించువారు లేరుగదా!

దేవ:- ఈ యాశ్రమము నారదునిదఁట! ఆయన నడిగి విజయ తేజునిజాడ తెలిసికొనియెదను ఆతఁడిప్పుడు నదీతీరమున కేగి జపము చేయుచున్నాఁడఁట! ఈ మార్గముననే వచ్చునఁట అంతవరకు నిచ్చటనే వేచియుండెదను?

విజ:- అంతకంతకు వెఱ్ఱియెత్తి నా స్థితి క్రమముగా నాకే విరుద్ధముగాఁ దోఁచుచున్నది. హా! మంజువాణీ! నీవిఁక నీజన్మమునకు లభింపవు గాఁబోలును? ఈ పిచ్చివానిని వేగముగా వచ్చి నీ ప్రేమామృత మిచ్చి బాగుచేసికొనుము.

దేవ - నారదుఁ డిటువచ్చునో? ఏదారినైనఁ బోవునో?

విజ:- నీ విరహాగ్నిని మాడి రూపుచెడి వెఱ్ఱియెత్తియున్న యీ విజయతేజునిఁ జూచి అహా! చెట్లు ఎట్లు కలకలమని నవ్వుచున్నవో!

తే. గీ. ఓ స్వభావమా! కాలమా! ♦ నీ స్వతంత్ర
మఖిలజగములఁ జెల్లు; న ♦ నాడి వీవు
ఎట్టులాడింప నటులాడు ♦ నెల్ల జనము
కీలుబొమ్మలకైవడిఁ ♦ బ్రాలుమాలి.

దేవ:- వృథాకాలయాపనమేగాని కార్యము సాగునదికాదు. నా కిక్కడఁ గూర్చుండుట ముండ్లపైఁ గూర్చున్నటులున్నది.

విజ:- ఓ చిత్తమా! వెఱ్ఱిదానివలె వెదకుచుంటివి! నీ మంజువాణిని జూచితివా! ఇదిగో! ఆ లతానికుంజపుంజముల మాటునడాఁగినీ కేదో యుపదేశించుచున్నదిఁ.

సీ. స్థిరమహోదార ♦ బం ♦ ధుర గౌరవము వీడి
చపలభావంబుచేఁ జనఁగవలయు
ధైర్యగాంభీర్య ని ♦ ధానదృష్టిని వీడి
బెదరుచూపులచేతఁ ♦ బెనఁగవలయు

హితవచోవిహితసం ♦ గతులఁ బల్కుటమాని
యపసవ్యవచనంబు ♦ లాడవలయు
అడిగినమాటల ♦ కైన మాఱాడక
మౌనయోగంబును ♦ బూనవలయు

విమలకల్యాణ గుణములు ♦ విడిచి మత్తు
మందు ద్రాగినక్రియ లోక ♦ మందుబుద్ధి
లేక యెవ్వారి కెఱుఁగంగఁ ♦ రాక పిచ్చి
వాఁడనై పొమ్మనుచు మంజు ♦ వాణి పలుకు

ఆహా! పిచ్చివాఁడను కాకపోయినను అయినట్లే. కాని పొమ్మను చున్నావు, ఎక్కడికిఁ బోవలయును? దేవలోకమునకా? దేవేంద్రుఁడు రమ్మనినప్పుడాలోచించెదను.

దేవ:- ఇక్కడ నెవరిదో కలకలము వినవచ్చుచున్నది నారదుఁడు కాఁడుగదా! వెళ్ళిచూచెదను (అని వెళ్లును.)

విజ:- ఓ మంజువాణీ! ఓ కొమ్మా! నీ పల్లవహస్తమున నన్ను రమ్మని పిలుచుచుంటివా? ఇదే వచ్చుచున్నాను. (ఒక పూలచెట్టుకడకుఁ బోయి) నన్నానాఁడు రాకాసులు మత్తుమందుఁ జల్లి తీసుకొనిపోయిరి సుమా! అప్పుడు నిన్నుఁ దలఁచి యెంతో దుఃఖించితిని. నిముష మొక యేఁడుగాఁ గడపితిని.

తే. గీ. కాలమా! నా మనఃప్రియ ♦ కడ మెలంగు
గడియసేపును ద్రుటిలోనఁ ♦ గడపినావు!

ఆమె నాతోడ నెడలించి ♦ యకట! యిప్డు
గడియ నొకయుగముగ మార్పఁ ♦ గలిగినావు!

దేవ:- ఈ మహానుభావుఁ డెవ్వఁడై యుండునో? చెట్లతోఁ బ్రసంగించుచున్నాఁడు. ఆహా! ఈ సుకుమార శరీరుఁడు విజయతేజుఁడే అయి యుండవలెను. లేనిచో నిట్లేల చనుదెంచును? అనుమాన మెందులకు? ఒక సమస్య నిచ్చెదను. దానిని బూరించినచో నీతఁడు తప్పక విజయతేజుఁడే. ఆతఁడు విద్వాంసుఁడటఁగదా.

విజ:- ఓసుఖులారా! వింటిరా ఓసుందరులతాంతములారా! పక్షులారా!

తే. గీ. నాఁడు మా సఖితోడ మా ♦ ట్లాడునపుడు
గంట లొకమాత్ర వాయింపఁ ♦ గలిగినట్టి
వగతు రీవేళఁ జచ్చిరే? ♦ యుగము కొక్క-
గంట వాయింపరే! వియో ♦ గంబునందు.

దేవ:- ఈ లతాంతములతోడను, నోరులేని పక్షులతోడను దన విరహము నెంతగా వెల్లడించుచున్నాఁడు! ఇతఁ డెవరో!

విజ:- నా పటము పూర్తిగా వ్రాసికొనవలెను. (వ్రాసి) ఓ వెఱ్ఱిహృదయమా!

తే. గీ. పటములోఁ బ్రియురాలిని ♦ వ్రాసి నిన్ను
వ్రాసికొంటివిగాని నీ ♦ వలపు వ్రాయఁ
గలిగినావె? చిత్తరువునా ♦ నిలిచినావు
విరహమిది గాని వట్టి సం ♦ బరముగాదు?

ఓతూలికా! నా ప్రియురాలిని లిఖింపఁగలిగిన నీవిప్పుడు ధన్యురాలవైతివి వ్యర్థుఁడనైననాతో నేమిపని? నీవిట వసింపుము!

దేవ:- ఆహా! ఏమి విచిత్రలేఖనాశక్తి!

చ. కురు లొాగి వీడి ధూళిమెయిఁ ♦ గొంగు విదుర్చుచు మాటలాడు సుం
దరి యొకచోట లజ్జముఖ ♦ తామరసంబునఁ దోఁప వేడ్కతో
విరిసరు లూని వీని మెడ ♦ వేసెదు దివ్యనధూటివంటి చి
త్తరు వొకచోట వ్రాసి కడుఁ ♦ దత్తరుఁడై విలపించు నేలొకో?

విజ:– ఈశారిక తాను కూరుచున్న చెట్లతో నేమో చెప్పు
చున్నది?

దేవ:– ఆహా! ఏమి వీనిఁజువివేకము! కిక్కురుమనుశారిక మాట్లా
డుచున్నదఁట! (ప్రకాశము) ఓ పరాధీనమానసా!

తే. గీ. మన్మథానలసంతప్త ♦ మానసమునఁ
గోరినను శారికలు సహా ♦ కారు లగునె?

విజ:–ఒక్క యర్ధపద్యముమాత్రమే చదివి యూరకున్న యీతఁ
డెవ్వఁడో? మావంటి మన్మథానలసంతప్తహృదయుల నాక్షేపించు
చున్నాఁడు! (ప్రకాశము) ఓ యర్థవాదీ! మోహమభిలషించి ఏమోహ
నాంగి కడకైన నడఁకువతో వెడలి మోహపాశమును వల్లించుకొనుము
అప్పుడుగాని నీ కెఱుఁగరాదు.

తే. గీ. కొమ్మలల్లాడఁ జెలి యను ♦ కొనెడునట్టి
కాముకుల కోర్కెలకు మేర ♦ గలదె? చెప్పుమ!

దేవ:– ఆహా! ఎంత చక్కగాఁ బూరించినాఁడు! ఇతఁడే తప్పక
విజయతేజుఁడు. (ప్రకాశము) రాజా! విజయతేజా! దేవేంద్ర మహా
రాజు నిన్ను దయచేయుటకుఁ గోరుచున్నాఁడు. కావున బోవుదము
రమ్ము!

విజ:– మంజువాణికడకా రమ్మనుచున్నావు?

దేవ:– కాదు శచీధవుని కడకు.

విజ:– శచీధవునకు నాతో నేమి పని?

దేవ:- నే నెరుంగను.

విజ:- నేను రాను.

దేవ:- ముజ్జగములకు రాజైన దేవేంద్రునిమాట తిరస్కరింప రాదు.

విజ:- అట్టి సమర్థుఁడు మా మంజువాణితో నన్నుఁ గలుపఁ గలఁడా?

దేవ:- అవశ్యము కలుపఁగలడు.

విజ - ఇఁక నేమి కావలయును? నడువుము. వెళ్లుదము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

## రంగము—దేవలోకము.

(మఠములో సత్యరేఖ శరద్రాధునియొద్ద కూర్చుండియుండును.)

సత్య:- హా! ప్రాణేశ్వరా! నన్నుఁ ద్రికరణశుద్ధిగా వరించిన నీ యెడల నెంత యుపచార మొనరించి పాపముఁ గట్టుకొంటిని? నాయందు గల మోహదేవతకు నీ ప్రాణములు బలియిచ్చితివా? కాదు నాకే బలి యిచ్చితివి. కటకటా! ఇంత నిష్కపట స్నేహితుఁడవని యెఱుంగక గర్హించినప్పుడు నీ మనంబెంత క్షోభించినదో? నన్ను నీవేమనుకొంటివో? నాఁడు నీ యుత్తరముచూచి నిరాకరించినప్పుడు నీ యవస్థ యెటుండెనో? ఓనాథా! నీవీపాపినితోఁ బొందుసేయ నుద్దేశించి నంతనే విషాధమై పాముకాటువలెఁ బరిణమించినది ఇఁక నెన్నిపడవలసియుంటివో?

సీ. పడరానికష్టముల్ ♦ పడి దుఃఖములకోర్చి
గండంబు లెన్నెన్ని ♦ గడసినావో?
రేపవల్ మాసత్య ♦ రేఖ దక్కునో? లేదో?
యనిమనంబున నెంత ♦ యడలినావో?
స్మరశరానలశిఖా ♦ సందోహమునఁ గాలి
యేలీలఁ దాలిమి ♦ దూలినావో?

రాజాత్మజుఁడవు బై ♦ రాగివేషంబు ధ
రించుచో నెంత ల ♦ జ్జించినావొ?

కటకటా! కుండలో నుండి ♦ కాలునపుడు
గిజగిజను దన్నుకొని యెంత ♦ కినిసినావొ?
చెడితి పాపాత్మనైతి నిన్ ♦ జేతులారఁ
జంపుకొంటిని నేనైనఁ ♦ జావనైతి

హా! నాథా! అయ్యయ్యో! ఇంకెక్కడినాథుఁడు? నేనే యనాథను. నిన్నుఁజూచి దుఃఖము నా శరీర మాపాదమస్తకముకాల్చి బుగ్గి చేయుచున్నది. నా ప్రాణములు శోషిల్లి జీవనపుటాలములపట్లు విడిపోవుచున్నవి. ఈ చచ్చి పడియున్న శరద్రథుని లేపువారెవ్వరు? ఇక నేనే నూతిలోఁ బడను? నామీఁద నీ యాకాశమైనఁ బడదే? నన్నే రాక్షసుడైన మ్రింగి గుటక వేయరేమి?

ఉ. ఎవ్వని వేఁడుదాన? నర ♦ రే! హృదయేశ్వరు జీవనంబు తా
నెవ్వఁడు కావఁగల్గు నతఁ ♦ డేక్రియ నాకుఁ బ్రసన్నుఁడౌనొ? యిం
కెవ్విధి దోఁప దీహృదయ ♦ మిట్టటు నుయ్యేల లూఁగసాగె నో
జవ్వనులార! వన్యమృగ ♦ జాతములార! వచింపరే దయన్?

సీ. ఘనులార! మునులార! ♦ గగనదేవతలార!
బ్రతికింపరే శర ♦ ద్రథుని మీరు?
నరులార! నాగకే ♦ సరులార! కరులార!
బ్రతికింపరే శర ♦ ద్రథుని మీరు?
ఝరులార! నాకని ♦ ర్ఝరులార! దరులార
బ్రతికింపరే శర ♦ ద్రథుని మీరు?
విరులార! కల్పవ ♦ ల్లరులార! తరులార!
బ్రతికింపరే శర ♦ ద్రథుని మీరు?

పక్షులారా! సరోజిని భాష్పులారా!
మానధనులారా! సర్వస ♦ మానులారా!
విధిగఁ బ్రతికింపరే శర ♦ దగ్ధునిమీరు?
ఆర్తరక్షకు లగుట; నే ♦ నబల నయ్య!

ఉ. మారసమానసుందరుని, ♦ మంజులగాత్రుని, మీననేత్రు, నే
పారు నపారమారశర ♦ వారములంబడి దగ్ధుఁడైన యీ
ధీరుని, నామనోహరు, ను దీర్ణవిలాసుని సిద్ధులార! మీ
కారుణికత్వ మేర్పడఁగ ♦ గావరే? బ్రోవరే? చూడరే దయన్?

ఉ. ఎవ్వరి కెగ్గుచేత కల ♦ నేని యెఱుంగఁడు తోడివారలం
దెవ్వరి నొవ్వ నాడఁడు న ♦ హీనచరిత్రుఁడు మాశరదగ్ధుం
డివ్విధి నేలపా లగుట ♦ కేవిధివ్రాసెనే? పూర్వకర్మ మీ
రవ్వవహింపజేసెఁ; గల ♦ రా ననుబోటియభాగ్యు? లక్కటా!

ఓ మణిమాలా! నీవన్ననన్నియు నిజమైనవి. యథార్థ పరిజ్ఞాన విహీన నైననేను నీయెడల నెంతయపచార మొనరించితిని! నీపట్టుదల నెఱవేఱినది. నాయం దసూయ వదలి యింకనైనను నీశరదగ్ధుని బ్రతికించుకొనుము. రమ్ము! నన్నేల యారడివెట్టెదవు. నాచేత నెంతగా బ్రతిమాలించుకొనవలెనని యున్నది? బ్రతిమాలించుకొనుము! అయ్యయ్యో! భూలోకగామినైన నిన్ను దివినుండి ప్రార్థించిన నేమి ఫలము?

చ. కలఁడుగదా! సదా సమ జ ♦ గంబులు దోర్బలశక్తి నేలఁగాఁ
గలిగినవాఁడు నిర్జరని ♦ కాయకిరీటకళాకలాపసం
కలితపదాబ్జుఁడై పొగడు ♦ గన్న సురేంద్రుఁడు చిన్ననాటి వ
త్సలతఁ దలంప కుండునె? ని ♦ జంబుగ నాతఁడు వజ్రియేనియున్.

హా! దీనదయావరా! జగత్త్రయరక్షకా! నేఁడెక్కడనుంటివి? నా శరదగ్ధుని బ్రతికింప నెఱుంగవా? నన్ను దిక్కుమాలినదానిం జేసెదవా?

జాలిలేదా? ఓ పురంధరా! ఓ సచీధవా! నామొరఁ యాలింపుము.

(దేవేంద్రుడును, పాంచాలరాజును, ప్రవేశించు చున్నారు)

దేవేం:- (తనలో) సత్యరేఖ కేదియో ఆపదసంభవించినది. వేగముఁగా బోయి నివారించెదను. (సమీపించి? ప్రకాశము) అమ్మా! సత్యరేఖా! నీముందర నున్నవారెవరు? నీవేల వగచుచుంటివి? ఆటపాటలచే మదీయనాట్యభవన మలంకరింపుచు అన్ని విద్యలం దారితేఱి తోడివారలలో వన్నెఁగాంచిన బంగారుబొమ్మవు. ముద్దులు మూటఁ గట్టు నీ వదనారవింద మశ్రుధారామిళితమై నా హృదయమునకు వికలత కలిగించు చున్నది. నిన్నెవరైన హింసించినారా? రాజైన నీతండ్రికి నీ వేకపుత్రి విగదా! నీ కేమి కొరత యున్నది? నీ దుఃఖకారణ మేమి?

సత్యా:- నా దుఃఖభారము కారణము చెప్పనిచ్చుటలేదు.

దేవేం:- నీవిట్లు ధైర్యముం దూలి వగచునంతటి ప్రమాదము వచ్చునందాఁక నేల యూరకుంటివి? నీవలన కానప్పుడు నన్నేల పిలిచితివి కావు?

మ. జగముల్, సర్వదిశావకాశములు నీ స్వర్లోకముౕ మద్భుజా
ప్రగాఢాశక్తిని ధాల్చి దేవనర వ ♦ ర్గం బింత చింతింపకుం
డఁగ నేఁ గంటికి ఱెప్పవోలెఁ గనుచుం ♦ డ న్నేఁడు నీకేటికిౕ
వగవం దోఁచె? వచింపు నీతలఁపు! సా ♦ ఫ్యలంబు గావించెదౕ.

సత్యా:- (లేచి) నాయపరాధమును మన్నించి నామనవి చిత్తగింపుము. (చేతులు జోడించి)

తే. గీ. నిష్కళంకుండు కపటంబు ♦ నేరఁ డెపుడు
అమితబలశాలి సకల ♦ విద్యలకు రావు
పుణ్యకల్యాణగుణముల ♦ పుట్టినిల్లు
వర శరద్రథుఁడితఁడు నా ♦ బావగారు

దేవేం:- ఓహో! ఈతఁడు శరద్రథుఁడా? ఈ వృత్తాంతమంతయు వినియేయున్నాను మిగిలినదానికి చింతించు టెందులకు?

సత్యా:- హా! నా బ్రతుకున కిఁక నీళ్ళు వదలుకొనవలసినదేనా?

ఉ. నన్ను వరించి ప్రాణముల ♦ నాకొరకుఁ బలివేసి బాధ లె
న్నెన్నొ సహించి తుట్టతుద ♦ కీల్గినవీరుఁడు, నా ప్రియుండు నా
పన్నుఁడు వీని లేపి నను ♦ వ్రయ్యలుచేసిన లేక కాచినన్
గన్నుల నీరు వెట్ట నటు ♦ గానియెడన్ దృజియింతుఁ బ్రాణముల్

దేవేం:- ఆహా! నీ వెంతమూర్ఖురాలవైతివి? వచ్చినవాఁడు మరల వచ్చునా?

సత్యా:- నన్ను రక్షించుటకు వచ్చినవాఁడ వట్లనవచ్చునా? అటులైన నీవు రాకయే పోవలసినది

దేవేం:- ఇది మిక్కిలి ప్రమాదము వచ్చినదే. నీ యభీష్టమును నెరవేర్చుటకు ప్రయత్నించెదను.

సత్యా:- నీవు తలంచుకొనినఁ గాకేమి?

దేవేం:- మారిషా! అశ్వినీదేవతలను తీసికొనిరమ్ము?

మారి:- చిత్తము! దేవా! (అని వెళ్ళును.)

పాంచా:- దేవేంద్రా! నా చిన్ని కొమారుని వెదకి తీసికొని వచ్చుట కెవరినైన బంపియుంటివా?

దేవేం:- మీ విజయతేజుఁడీపాటికి వచ్చుచునే యుండును.

పాం:- నా యనంగు పుత్త్రకుని జూడలేదను మహావిచారము నా ప్రియమిత్త్రుఁడవగు నీవు పోఁగొట్టినందులకు నీకనేక వందనములు చేయుచున్నాను.

(అశ్వినీ దేవతలు ప్రవేశించుచున్నారు.)

అశ్వి:- దేవేంద్రమహారాజా! సెలవు ప్రకారమువచ్చిన మా కెచ్చట నేమికార్యమున్నది?

దేవేం:- ఏదియున్నను మీ కసాధ్యమైనలేదు. మీరు త్రిలోకాధారులు సర్వజ్ఞులుగదా!

అశ్వి:- ఎట్టి చికిత్సలు చేయుటకైనను సిద్ధముగ నున్నారము.

సీ. దేహరోగంబైన ♦ దివ్యౌషధం బిచ్చి
మాన్పివేయుటకు యా ♦ మంబు పట్టు
మతి చంచలించిన ♦ మందుమాకులచే స్థి
రంబు చేయుటకు ది ♦ నంబు పట్టు
దయ్యంబు సోఁకిన ♦ తంత్రమంత్రంబులఁ
బోఁగొట్టుటకు నొక్క ♦ పూఁటపట్టు
సర్పదష్టంబైన ♦ జడమూలికలచేత
బ్రతికించుటకు ముహూ ♦ ర్తంబు పట్టు
పెట్టుమందు లైన కట్టైన క్రియులచేఁ
బెఱికివేయుటకొక ♦ స్వరముపట్టు
విరహబాధయైన వింజామరలచేత
వెడలఁగొట్టుటకొక ♦ గడియపట్టు.

దేవేం:- వేఱుగఁ జెప్పనేల? భవదీయదివ్యామృతహస్తంబునం గదా మేము జరారోగ పీడనంబులు లేక నిర్జరుల మైతిమి! నేఁ డీశరద్రథుని మీవైద్యపాండిత్య ప్రభావమున బ్రతికించి సత్యారేఖకు సంతోషముం గూర్పుఁడు!

అశ్వి:- అదెంతసేపు! (శరద్రథునిచేయి పట్టుకొని) ఈతని బ్రతికించుట యొకలెక్కా! (నాడిచూచి) ఏమిది? ఆశ్చర్యము! (సర్వాంగములం దడవి చూచి) ఈతని నాడియే మాకు గోచరము కాలేదు అక్కటా! నేఁటితో నా వైద్యవిధానము భస్మీభూతమైనది. ఇప్పుడు నేనశ్వినీదేవతనో? గ్రామదేవతనో? తెలియలేకున్నాను. ఆహా!

తే. గీ. అరె! మృతక ళేబరమొ? కళే ♦ బరముమొ? యిది వి
రాగమో? గోగమో? యను ♦ రాగమొక్కొ?
జీవనాడులు లేవు ని ♦ ర్జివి కాఁడు
తనువు కాదిది కాలిని ♦ యినుముగాని.

దేవేంద్రా ఈనాడి విధానము మాకెన్ని తెలుంగుల నెఱుంగరాకున్నది ఇది యేమనియు నిశ్చయింపలేకున్నారము. (అని మరలఁజూచి) కట్టా! భిషక్సిద్ధాంతమున కతంకు విధాతవై యీ ధాతువును గ్రహింపలేకపోయితిని! ఈ యపకీర్తిఁదల ధరించుటకంటె నురిపెట్టుకొనుట కర్తవ్యము. బిరుదుపోవుటకంటె మరణమే శ్రేయముగదా!

పాం:- (తనలో) నా పుత్త్రుఁడు విజయతేజుఁడు వచ్చుచుండెనేమో? ఎదురేగెదను.

(అని నిష్క్రమించును.)

దేవేం:- భిషగ్వరా! ఇంతలోనేమాయెను? అనన్యసామాన్యమైన మీ శక్తి యెవరెఱుంగనిది? ఎంతటివారికైనఁ గారణాంతరమున స్ఫురింపకుండుటచేత నొకప్పుడను లోమవిలోమములు తటస్థించుచుండును. అట్టియెడ కాంతచిత్తులై గురుబుద్ధిని గ్రహించుట కర్తవ్యము.

అశ్వి:- సరే. అట్లే యొనరింతము.

దేవేం:- అదిగో! సమయమునకు గురువరేణ్యులే చనుదెంచుచున్నారు.

(బృహస్పతి ప్రవేశించున్నాడు)

దేవేం:- గురువర్యా! నమస్కారము.

బృహ:- సుఖీభవ?

దేవే:- తలంపులోనే అలభ్యయోగముగా విచ్చేసిన తాము మమ్ముఁ గృతకృత్యులం చేసితిరి.

బృహ - మీసమాచారమేమి? అందఱుంజేరి యిట్లేల యిచ్చట నున్నారు?

దేవేం:- శరద్రథుః-

బృహ:- ఆఁ! తెలిసినది. నేనును, ఈ విచిత్రచరిత్రము వినియే వచ్చితిని.

దేవేం:- ఈ యశ్వినీ దేవతల భ్రాంతిని బోఁగొట్టి సత్యరేఖకుఁ బ్రియంబుఁగూర్చుటకు వేఁడుచున్నాము.

బృహ:- శరద్రథుఁ డేకుండలో నుడుకఁ బెట్టఁబడినాఁడు?

సేవ:- ఇదిగో! (అని కుండను జూపుచున్నాఁడు)

బృహ:- దేవేంద్రా! ఇందులో నేవియో యక్షరములున్నవి. చదివి వినిపింపుము!

దేవేం:- అందులో నేమి యక్షరములుండును? ఉండినఁ జదివెదను.

బృహ:- అశ్వినులారా! మీ వైద్యశాస్త్రమునందెందేని నీరీతి రోగములున్నవా? ఇందున కేమైన విదానము లూహించి చికిత్సచేయుట మీ రెఱుంగుదురా?

అశ్వి:- ఎఱుంగక యే సిగ్గునఁ దలవంచుకొని యూరకున్నారము

బృహ:- దేవేంద్రా! అందులోనున్న యక్షరములను దిలకించితివా?

దేవే:- చిత్తము. మూఁడుపాదములుగల యసంపూర్ణమైన పద్య మున్నది.

బృహ:- ఏదీ! ఎట్లున్నదో చదువుము!

దేవే:- ఈ కాగితముపై వ్రాసి చదివెదను. (వ్రాసి)

చ. భరమయి దుఃఖసంకలిత ♦ పంకిలమై యలరారునీ మహో
 విరహదవాగ్నికంటె యిది ♦ వేసటగా దిది యగ్నిగాదు మ
 త్తరుణిరో! యుష్మదాజ్ఞ జవ ♦ దాఁటక యుంటి మదీయ దేహముః

అనియున్నది.

బృహ:- ఆహా! ఇతఁడీసత్యరేఖ నెంతగా వలచియున్నాఁడు! ఈ పద్యమునే మరలఁ జదువుము!

దేవే:- (చదువును.)

బృహ:- ఈ పద్యముయొక్క నాలుగవపాదము పూరించిన నీతఁడవశ్యము లేచును. మందులు మాత్ర నుక్కరకురావు.

దేవేం:- తాము పూరింపఁ గూడదా?

బృహ:- విరహులుగాని దీనిని బూరింపనేరరు.

దేవేం:- ఈ శరద్రథుని యనుంగు చెలికాఁడు సాత్యవతేయు డున్నాడు. అతని కీతని హృదయము తెలియకపోదు. అదిగాక యతఁడసమాన సాహితీనిపుణుఁడు; మణిమాలకై తపించుచున్నాఁడు; శరద్రథుని వంటివాఁ డనవచ్చును.

బృహ:- ఇఁక నేమి? వేగముగాఁ బిలువ నంపుము!

దేవేం:- చిత్తమట్లే పిలిపించెదను. సేవకా! సాత్యవతేయుని దోడ్కొనిరమ్ము!

సేవ:- చిత్తము! దేవ! (అని నిష్క్రమించును.)

బృహ:- దేవేంద్రా! పాపమీ సత్యరేఖ మూర్ఛపడియున్నది సుమీ!

దేవేం:- దానికున్న దుఃఖ మెవరు చెప్పఁగలరు?

(యతివేషముతోనున్న మణిమాలయు సాత్యవతేయుఁడును ప్రవేశించుచున్నారు.)

సాత్య:- (తనలో) నన్నీ దేవేంద్రుఁడు లెందులకో రమ్మనిరి? పెద్దలయాజ్ఞ శిరసావహింపకతీరదు. మణిమాల నన్ను విడిచినదిమొదలు నా కంటికి నిద్రయును, సుఖమును లేదు కాని, ఈ తపసిని జూచినప్పటి నుండి కొంచెము ధైర్యము తెచ్చికొని సంతృప్తినొందుచేగాని ఈతఁడు మనసీయకున్నాఁడు. ఆహా! ఇటువంటి మహాసౌందర్యశాలి నొక మహా

రాజుగాఁ జేయక బైరాగిని జేసి ఘోరాటవిని విడిచిన యా పరమేశ్వరు నెవ్వ రేమనుటకును వలనుగాదుగదా!

తే. గీ. సహజసౌందర్య సకల ల ♦ క్షణము లొసఁగి
నతని జేయక యీతని ♦ యతిని జేసె
దైవ మిప్పుడై నను జేయఁ ♦ దలచుకొనిన
బండులోడలు నోడలు ♦ బండ్లుగావె?

(ప్రకాశము) యతీశ్వరా! తాము ముందు నడుఁవుడు!

మణి:- అట్లే నడిచెదము. నీవును మావెంట రమ్ము!

సాత్యా:- (సమీపించి) దేవేంద్రా గురువర్యా! నమస్కారము.

దేవేం } సుఖీభవ!
బృహ }

సాత్యా:- నన్నేలరావించితిరి? ఇచ్చట నాచేయు కార్యమేమున్నది

బృహ:- దేవేంద్రా! ఈ సాత్యవతేయుఁడు శరద్రథునిచూచెనా మహాదుఃఖితుఁడై యీ పద్యమును బూరింపలేఁడు.

దేవే:- మఱి యేమిచేయవలయును?

బృహ:- ఆతని కగపడకుండ నడ్డముగా నిలువుము!

దేవే:- చిత్తమట్లే.

బృహ:- వత్సా! సాత్యవతేయా! నీ కవితామహత్యమున నసంపూర్తిగా నున్న యొక పద్యమును బూరింపవలసియున్నది.

సాత్యా:- మీరు దేవగురువులు. మహాకవులు. మీయెదుట నేను పద్యము చెప్పఁగలనా? శిష్యున కేమియాజ్ఞ యొసంగినను చేయుటకు సిద్ధముగా నున్నాను. ఆ పద్య మెన్నిపాదములు కలదో? ఒకమాఱు చదువఁ గోరెదను.

మణి:- (తనలో) హా! నెచ్చెలీ! హా! ప్రియసత్యరేఖా! ఎంత దుఃఖించి శోషిల్లియుంటివే తల్లీ! నిన్నును, నీ శరద్రథుని యవస్థలును

చూచినంతనే నిలువు నీరగుచున్నాను. నీ స్నేహంబుఋణ మెట్లు తీర్చుకొందును? నేను విన్నవించినప్పుడే యీ శరదర్థుని నీవు వివాహమాడిన యెడల నీకీపాట్లు లేకపోవునుగదా? ఎందుకీ నాటక మాడించితివి? సరే. అయినదానికి వగచు టెందులకు? ఏదైన ప్రతిక్రియ నూహించి నీకానందముం గూర్చెద నుండుము! నా పట్టుదల పూర్తిగ నిర్వహింపబడినది. నా కింక క్రోధము తీఱినది. కాని నేనీ దురంతము చూడలేకున్నాను.

బృహ:- అని దేవేంద్రుడు చదువ వలయును. ఇంద్రా! ఇటు రమ్ము! నీ స్థానమున నే నుండెదను.

దేవేం:- చిత్తము. (అనివచ్చును.)

బృహ:- ఆ మూడుపాదములును జదువుము!

దేవేం:- (చదువును)

సాత్య:- (కాగితముం గైకొని పద్యము మొదటినుండియుం జదువుచు నాల్గవపాదము.)

చ. కర మనురాగ మొందుటను ♦ కాలక కాలినయట్లు తోఁచెడిన్.

(అని పూరించును)

బృహ:- ఈ పూరణ మనుభవైకవేద్యముగా లేదు.

సాత్య:- (తనలో) హా! మణిమాలా! న న్నేలవిడిచితివి? నీ వెంట నొకదాసునిగాఁ దీసికొని పోకుంటివా?

దేవేం:- ఎట్లు చెప్పవచ్చును?

బృహ:- అతఁడు లేవఁ కుండుటయే నిదర్శనము.

దేవేం:- ఏల లేవలేదు?

బృహ:- సంపూర్ణమోహావారాశిని మునుంగని విరహుల కిది పూరింపరాదు అందువలననే అతఁడు లేవలేదు.

మణి:- దేవేంద్రా! ఈ పద్యమును పూరించుట కొక విజయ తేజునికిఁ దక్క నొరులెవ్వారికిని శక్యముకాదు.

దేవేం:- ఏ విజయ తేజుఁడు?

మణి:- పాంచాలుని కుమారుఁడు.

దేవేం:- సరే నామిత్రుఁడైన పాంచాలుని తనయుఁడగు విజయ తేజుని బెదకి తెచ్చుటకు భటుని బంపియున్నాను. అతఁడీపాటికి వచ్చుచునే యుండును.

(విజయ తేజుఁడు భటునితోఁ బ్రవేశించును)

దేవేం:- ఇదిగో! భటుఁడు వచ్చుచునేయున్నాఁడు.

భటు:- దేవా! విజయ తేజుని దోడ్కొనివచ్చినాఁడను.

దేవేం:- (ఆనందముతోఁజూచి) ఈతఁడేనా మా పాంచాలరాజ పుత్త్రుఁడు? తండ్రీ! విజయ తేజా? ఇటురమ్ము!

విజ:- ఆహా! వెఱ్ఱివారలారా! ఇంత పరిజ్ఞానములేదా?

తే. గీ. తెలియకను చేయ నగుఁగాని ♦ తెలిసి చేయు
వాని నేమనఁదగు? భగ ♦ వంతుఁ డతఁడు
లీల నిద్రించువానిని ♦ లేపవచ్చు
దొంగనిదుర వోయిన లేపు ♦ దొరలు గలరె?

దేవే:- నాయనా! నా మిత్రుని పుత్త్రకుఁడవు సౌందర్య కళానిధి వని సంతసించెడు నాకు నీపిచ్చి యెంత దుఃఖమును కలిగించుచున్నదిరా? తండ్రి!

తే. గీ. సొగసుకాఁడని నీయంద ♦ సూయచేత
మంత్ర మూఁదిరో? మందులు ♦ మాకు లిచ్చి
పసరు రాచిరో వెఱ్ఱికా ♦ వలయు ననుచు?
దుష్టు లోర్వరు పరుల యు ♦ త్కృష్టదశకు.

విజ:- ఓచెలీ! నేను నవ్వుచుండఁగా నీ వేల యేడ్చెదవు?

ఉ. కాటుకనీరు నీలముల ♦ కైవడిఁ గన్నులఁ జార నేడ్చెదో
పాటలగంధి! చన్నుఁగవ ♦ పై కెగయంగ విపంచికాతతుల్
మీటిన మ్రోయునట్టు; లిది ♦ మీకులవేషమొ? పాడుబుద్ధియో?
బోటుల యేడ్పు పాంథుమెడఁ ♦ బోసెడు నాయురిత్రాడు గాదొకో?

దేవేం:- గురువర్యా! ఈతనిపిచ్చి వదలుటెట్లు? ఎటువంటివాని కెంత దురవస్థ వచ్చినది?

బృహ:- శరద్రథుఁ డగ్నిలోఁగూలి కాలకుండ పెట్టిదియో ఇతని పిచ్చియు నట్టిదే! దీనికౌషధము గుణమియ్యదు. ప్రయత్నములు సాగవు.

దేవేం:- మఱి యెట్లు?

బృహ:- ఒకచోటఁ గూరుచుండఁ బెట్టుము! ఆలోచించి చెప్పెదను.

మణి:- (తనలో) పాప మీవిజయతేజున కెంతచేటు వచ్చినది? మంజువాణికిని సంతసము గూర్చియే తీఱెదను.

దేవేం:- నాయనా! ఈ యాసనంబునఁ గూరుచుండుము.

విజ:- (కూర్చుండి) కొట్టితే కొట్టితివిగాని తిట్టితే తిట్టకుము!

దేవేం:- అట్లేల యూరకే వదరెదవు?

విజ:- నీవేనా దేవేంద్రుఁడవు? ఆహాహా! (అని నవ్వును.)

దేవేం:- నవ్వెద వేమి?

విజ:- మీరును నవ్వుచునే యున్నారుగదా!

దేవేం:- లేదే!

విజ:- లేకేమి? ఏడ్వకపోవుటయే నవ్వుట. నాకు జిహ్వాలేదు. మాయమ్మ గొడ్రాలు మా తండ్రి బ్రహ్మచారి. నీవు పిచ్చివాఁడవు.

నేను దేవేంద్రుడను ఇంతకంటె నేమున్నది? ధాన్యపుగింజలో బియ్యపు గింజ. మాయలో తేజము. చీకటిలో వెలుతురు.

దేవేం:- ఆహా! నీ కెంత వెఱ్ఱి పట్టినది? ఈ పద్యము నెవరు పూరించెదరు? ఈ కార్యమెట్లు సాధింపవచ్చును?

విజ:- దేవా! అట్లేల సంశయించెదవు? ఇటు చూడుము!

మ. గిరులన్ దోమలు మ్రింగెవార్ధి నివడిన్ ♦ గీరాంగనల్ త్రావెడిన్
వరవర్షంబునఁ జూరునీళ్ళు నడికు ♦ ప్పన్ బాఱు నయ్యారె! భా
స్కరుఁ డాయర్ధనిశీథినిన్ వెడలె నీ ♦ కాకంబు లాపంచమ
స్వరమున్ బాడును కాకవుల్ సుకవులై ♦ సంస్థానముల్ చేరెదర్.

బృహ:- వీడెంత మతిభ్రష్టుఁడైనను తన నిర్దుష్ట కవితా మహత్త్వాభిమానము మాత్రము వీడలేదు సుమా!

దేవేం:- ఏల విడుచును?

బృహ:- ఈతఁ డెట్లు బాగుపడునో నాబుద్ధికి దోఁచకున్నది. కాని, మంజువాణి యనుకన్యను మోహించి తదీయవిషాదమున వెఱ్ఱి వాఁడైనట్లు తోఁచుచున్నది. ఇందుల కీయతీశ్వరుఁ డేమి సమాధాన మిచ్చునో తెలిసికొని ఆ ప్రకారము చేయుట మంచిది.

దేవేం - యతీశ్వరా! నీయాజ్ఞ యెట్లు? విజయతేజుని దోడ్కొని వచ్చితిమి. కాని, పిచ్చివాఁడైన వీఁ డీపద్యము నెట్లు పూరింపగలఁడు? శరదభ్రుఁ డెట్లు బ్రదుక నేర్చును?

మణి:- మంజువాణికడ కూర్వశిం బంపి "నిన్ను మణిమాలా రమ్మనుచున్న"దని పిలిచిన నామె వచ్చును. ఈ విజయతేజుఁడు మంజువాణిని చూచినతోడనే యీ చాంచల్యమునుండి విముక్తుఁడై మీ పద్యముం బూర్తిచేయును.

సాత్య:- (తనలో) మాయతి మణిమాలను స్మరించుచున్నాఁడు! ఈతని కేమైన నామె జాడ తెలియునేమో?

దేవేం:- సేవకా! నీ పూర్వశిక డకుంబోయి మంజువాణిని, మణిమాల రమ్మనుచున్నదని చెప్పి తోడ్కొని రమ్మని చెప్పుము!

సేవ:- చిత్తము. (అనిపోవును.)

దేవేం:- మణిమాల కడు నేర్పరియని విన్నాను, ఆమె యుండిన నీసత్యరేఖ కింతచేటు రాకపోవునుగదా.

బృహ:- వారిరువురును కలహించిరఁట! మణిమాల యెక్కడికో పోయినదఁట!

దేవేం:- ఏమి కలహించిరో?

బృహ:- సత్యరేఖ, తానత్యంత సౌందర్యవతి ననియు, నాకంటె సుందరులు లేరు గావున నే నెవ్వరిని వివాహ మాడ ననియు ప్రగల్భములు పలికిన దఁట! ఆ పలుకులు మణిమాలకు కటువుగాఁ దోఁచుటచే నీ వ్రతభంగముచేసి నీగర్వ మణఁచెద నని ప్రతిజ్ఞపట్టి యేమేమో చేసినదఁట!

విజ:- నే నింకఁ బోవలయును (పోఁబోవును)

దేవేం:- ఎక్కడికిఁ బోయెదవు?

విజ:- ఇప్పుడు కొంత సావకాశము చిక్కినది! నాయుదంత మంతయు వినుము.

సీ. ఎండుమూడలపాలు ♦ నెండమావులనీరు
దగలేనిదాహంబుఁ ♦ దాపి తాపి
వంధ్యాతనయు నింట ♦ వసుధఁ గానని చోట
నివసించి రేయెల్ల ♦ నిలిచి నిలిచి
ఇసుక నూనెను దీసి ♦ యెండలో వెల్గించి
చెట్లకుఁ జదువులు ♦ చెప్పి చెప్పి

ఆకాశపుష్ప శ ♦ య్యలఁ జేరి వగగూరి
సిమరించి దేశముల్ ♦ వెదకి వెదకి

చోటు గానని మా యావ ♦ ఘోటికొరకు
స్థాణుపురుషులు స్వప్నంబు ♦ లోనఁ గనిన
దంతియూథంబుపై నెక్కి ♦ దారుశిలల
విగ్రహములతోఁ బోరాడ ♦ వెడలువాఁడ!

(అప్పుడు మంజువాణితో ఊర్వశి ప్రవేశించుచున్నది.)

ఊర్వ:- దేవా! మంజువాణిం దోడ్కొని వచ్చితిని.

మంజు:- దేవేంద్రా! నమస్కారము!

దేవేం:- కల్యాణమస్తు! (విజయతేజునిం జూచి) విజయతేజా! ఈమె నొకమారు చూడుము!

మంజు:- (తనలో) ఇదే! నా ప్రాణేశ్వరుఁడు! (యతింజూచి ప్రకాశముగా) చెలీ! మణిమాలా! నా యందెంత కరుణయుంచి నా విభునితోఁ గలిపి నా దుఃఖమును చల్లార్చితివి! నీకు నే నీప్రాణములు ధార వోసినను నీ యుపకారమునకు ఋణము తీఱదుగదా!

సాత్య:- (తనలో) ఆహా! ఈమంజువాణి ఈయతిని మణిమాలా! అని సంబోధించుచున్నది. ఈమె యతిగాదు. సతియే (ప్రకాశము) ఓ మణిమాలా! ఓ నా ప్రాణపదమా! ఓ మనోహారిణీ! ఇన్నాళ్ళు నన్నేల వంచించితివి? నీ కపట సన్న్యాసమింక నైనఁదీసి పార వేయుము.

తే. గీ. యతి వని భ్రమించి యున్నాళ్ళు ♦ వలఁతిఁజేసి
సతి! గుణవతి వని యెఱుంగఁ ♦ జాలనైతి
తప్పు మన్నించి నన్ను నీ ♦ దాసునిగఁ బ
రిగ్రహింపుము! నీవాఁడఁ ♦ బ్రేమతోడ.

విజ:- ఇదిగో! మా మంజువాణి వచ్చియున్నది! హా! ప్రాణేశ్వరీ! నన్నిన్నాళ్లు విడిచి యెట్లు నిలువఁగలిగితివి? నీ విరహమున వెఱ్ఱి

వాఁడనై వాడవాడలఁ బర్వతదరీతటంబులఁ దిరుగాడుచు నిన్ను వెదకుచుంటిని! ఇట్టే రేయిం బగళ్ళు మాయించుచుంటిని.

తే. గీ. ఏవనితకొఱకయి ♦ యీక్షించి కన్నులు
కాయకాచెనో యు ♦ దేయతివ గ
దా! యిది లభియించె ♦ నాయాస లెల్ల సి
ద్ధించెఁ గోరికలు ఫ ♦ లించె నిపుడు.

నేఁడు నాఁటిస్వయంవరమువలెనే తోఁచుచున్నది. ఆహా! వీరు దేవేంద్రాదులు. నేనొకమాఱిదివరకు చూచియున్నాను. వీ రిచ్చటి కేల వచ్చియున్నారో? నేనిదివరకు నేమేమో మాటలాడుచు నల్లరి చేయుచుంటిననుకొనియెదను. కట్టా! వీరియెదుట నట్టి యవివేకపుచేష్టలు చేయవచ్చునా? నాబుద్ధిమాంద్య మెంతచేసినది! దేవేంద్రా! నమస్కారము! గురువర్యా! నమస్కారము!

దేవేం } సుఖీభవ!
బృహ }

బృహః- దేవేంద్రా! సూర్యునిచేఁ జీఁకటి విచ్చినట్లు మంజువాణీ సందర్శనమున వీనిపిచ్చి యెంతలో వదలిపోయినది? ఆలస్యము చేయక పద్యమును బూరింపుమనుము.

దేవేం:- చిత్తము!

విజ:- దేవా! నన్నిచటి కేల తోడ్కొని వచ్చితిరి?

దేవేం:- ఈ పద్యమునందు నాల్గవపాదమును బూరింపవలయును

విజ:- ఏదీ! ఆ పత్త్రమిటు చూపుఁడు!

దేవేం:- (ఇచ్చును)

విజ:- (చదివి) కటకటా! ఈస్థితి నావంటి యదృష్టవిహీనునిదే! (తనలో) హృదయమా! ఊరడిల్లుము! నీ మనోహారిణిదర్శన మైనదను సంతోష మీపద్యము చెప్పినవానిని దలంచుకొనినతోడనే పోయినది!

బృహ:- పురందరా! చూచితివా! వీఁడెంతరసగ్రహణము కల వాఁడో?

దేవే:- ఇది విన్న నాకును జాలి యగుచున్నది.

బృహ:- విజయతేజా! ఆలస్యముచేయక ఆ పద్యమును బూరింపుము!

విజ:-చిత్తము అట్లే చేసెదను అని పద్యము మూఁడుపాదములు చదివి)

'చఱచిన లేచివచ్చెద ని ♦ జంబుగ నిన్ను వరించి యుండుటన్.'

(అని నాల్గవపాదము పూరించును)

దేవే:- ఆశ్చర్య మాశ్చర్యము! (పద్యమంతయుఁజదివి) దేహము చరచిన లేచునా?

బృహ:- సందేహమేల? అట్లాచరించి చూడుము! తప్పకీతఁడు లేచును. ఈ పాదమును వ్రాయుసరి కాతని ప్రాణములు శోషిల్లి స్పృహ తప్పియుండవలయును.

అశ్వి:- చచ్చి కొయ్యయైయున్నవానికి మోహ మెక్కడ? మన్నెక్కడ? తన మోహినిదేహమును చేతితోఁ జరచినంతనే లేచి వచ్చునని ఈ పిచ్చిపుల్లయ్య పద్యము పూరించుటయు ఈ వెట్టిగురువు డౌననుటయు బాగుగనేయున్నది. చాలు! చాలు!

మణి:- నాథా! నా యనుంగుచెలి నీ చెలికాఁడగు శరద్రథుని మోహించి వానిని నేరక యగ్నిం దోసి చింతించు చున్నది.

సాత్య:- ప్రాణేశ్వరీ! నా చెలికాఁడు శరద్రథుఁ డగ్నింబడియెనా? (చూచి) హా! మిత్రుఁడా! శరద్రథా! ఎంత దురంతము వచ్చినది! "ఆ పాపకుండు నిన్నెట్లు కాల్పఁగలిగెను?" నీసంగతి నాకేమియుఁ దెలియుట లేదే! అయ్యో! నీవులేక నేనెట్లు బ్రతుకఁగలను?

బృహ - దేవేంద్రా! వానినూరడించి శరద్రథుని సత్యరేఖచే లేవజేయుము.

దేవేం:- చిత్తము అట్లే చేసెదను.

బృహ:- సాత్యవతేయా! నీవీతనికొరకు దుఃఖింపవలసిన పని లేదు. కొంతసేపూరడిల్లుము! సత్యరేఖతో పాటు నీవును మహానందము నొందెదవుగాక!

సాత్య:- దేవా! ఇక నా కెక్కడియూరట? నా ప్రియమిత్రుని చావుకంటె నాబ్రతుకే వేదనాకరమైనది. నేనుమాత్రముండి యేమి చేసెదను?

దేవేం:- అట్లుగాదు ఈవంకకు రమ్ము! చెప్పెదను.

సాత్య:- (కొంచెము తొలఁగి తనలో) ఓ హృదయమా!

తే. గీ. ప్రాణనాయిక సిద్ధించె ♦ నన్న, నింత।
లోనమిత్రవర్యునిచావు ♦ గానవచ్చె
సంతసము, చింతయొకమాఱు సంభవించె।
వానయును నెండయునుగూడి ♦ వచ్చినట్లు

దేవేం:- అమ్మా! సత్యరేఖా! నీ భర్తను నీవే బ్రతికించుకొనవలెను.

సత్య:- దేవా! సమర్థులైన మిమ్ము ప్రార్థించినప్పు డిట్లనఁ జెల్లునా?

దేవేం:- మే మేమిచేయుము?

సత్య:- ఇచ్చట మా మణిమాలయైన లేదుగదా।

మణి:- ఇక నా కీ యతివేషముతోఁ బనియేమి? (అని తీసి పారవైచి) చెలీ! సత్యరేఖా! ఏమియుం జేతగాని నీ మణిమాల ఇదిగో! నీయెదుటనే యున్నది. (అని కౌఁగిలించుకొనుచున్నది.)

దేవేం:- అమ్మా! సత్యరేఖా! నీభర్త లన జీవనౌషధము నీ చేతనే పెట్టి యుంచినాఁడు.

సత్య:- పాపాత్మురాలనగు నే నంత భాగ్యము చేయలేదుగదా!

దేవేం:- నీచేతిలో వానిదేహముం జరచిన లేచివచ్చెదనని వాని వ్రతమంట!

సత్య:- అట్లేచేసి చూచెదను. నాథా! లెమ్ము! నిర్భాగ్య నగు నన్నుఁ గన్నులువిచ్చి చూడుము! (అని వెన్ను చరచుచున్నది.)

శర:- "చరచిన లేచి వచ్చెద ని ♦ జంబుగ నిన్ను వరించియుండుటన్" (అని చదువుచు లేచి) హా! సత్యరేఖా! ఇదేవచ్చుచున్నాను.

సత్య:- (శరదంభుని హస్తముతోఁ బట్టుకొని)

ఉ. నేఁడుగదా! మనోరథము ♦ నిండే; దురంతవిపద్ఘనౌఘముల్
వీడెను; భాగ్యపంకజము ♦ విచ్చె; మనోహరమూర్తిదక్కె; నా
తోడినృపాలపుత్త్రికల ♦ దోషము లెంచని చారు గీర్తితోఁ
గూడి సుఖించెదన్ మదిని ♦ గోరినకోరికలెల్లఁ దీరఁగన్.

సాత్య:- హా! మిత్రమా! నేనెంతటి యదృష్టవంతుఁడను! (అని కౌఁగిలించు కొనుచున్నాఁడు)

బృహ:- ఆశ్చర్య మాశ్చర్యము!

దేవే:- ఏమిది? వింతగా నున్నది!

అశ్వి:- ఏమి? ఈ భూలోకవైద్యుని యపూర్వనైపుణ్యము!

మణి:- చెలీ! సత్యరేఖా! (అని కౌఁగలించుకొనును.)

సత్య:- సఖీ: మొదట నీమాటలను నిరాకరించిన నా యపగాధ మును మన్నింపుము!

బృహ:- అభినవదంపతులచే నీ సభ యెంతశోభాయమానమై యున్నది!

దేవేం:- విజయతేజా! నీకదృష్టదినములు వచ్చినవి. నీ మంజు వాణియు నీకు లభించినది. దంపతులగు మీయన్యోన్యసమ్మేళన సందర్శనమున నీతల్లిదండ్రులం దనుపుఁ జిరకాలము వర్ధిల్లుము.

బృహ:- తథాస్తు.

దేవేం:- గురువర్యా! సత్యరేఖాశరద్ఘ్నుల వివాహముం జరిగించి యక్షరాజునకు మహానందముం గూర్పగలముగదా!

బృహ:- అగునీదంపతులకు శుభమగుఁగాక! వీరి వివాహ మమరావతిని సేయవలెను.

దేవేం:- మణిమాలా! నీకేముషీవిశేష మెంతయు గొనియాడఁదగినది. నీవంటి వివేకవతి యీ రేడులోకంబున గూడ గానరాదు.

సీ. సత్యరేఖయునీవు ♦ సకియలాటకుఫలం
  బలశరద్ఘ్నునామె ♦ గలిపినావు
  వరమైత్రినల మంజు ♦ వాణికి ప్రియమొప్ప
  విజయ తేజుని దెచ్చి ♦ పెట్టినావు
  నీవల్ల ఘునియెడ ♦ నెనరుంచికానలో
  సహకారివై వాని ♦ సాకినావు
  కులధర్మములు నీట ♦ గలపకే యెవరుకో
  రినవల్లభులవారి ♦ దనిపినావు

    తే. గీ. దివినిభువిజేసి భువిని యీ ♦ దివినిజేసి
        మించువేడుక నాట్యమా ♦ డించినావు
        అఖిలసద్గుణ జాల వి ♦ ద్యాలవాల
        బాల మణిమాల విమల సౌ ♦ భాగ్యశీల.

మణి:- దేవర నన్నింత స్తోత్రము చేయుటకుఁ దగను.

దేవేం:- నా మిత్రపుత్త్రుఁడగు విజయతేజునకును, యక్షరాజతనయ యగు సత్యరేఖకును మహోపకారముం గూర్చిన నీకుఁ బారితోషకముగా నీ ప్రియుఁడగు సాత్యవతేయుని నేనే స్వయముగాఁ గూర్చుచున్నాను.

మణి:- (సిగ్గుచేఁ దలవంచుకొనుచున్నది.)

దేవేం:- సాత్యవతేయా! ఇటురమ్ము!

సాత్య:- (వచ్చుచున్నాఁడు)

శా. మీారనోన్యన్య విలాసవైఖరులతో ♦ పేలంబులన్ గూడుచున్
దారుణ్యాంబను పూలమాలికకునెన్ ♦ త్రావిన్ బ్రసాదించియా
గౌరీశంకరులట్లు లోకక్కతనువై ♦ కల్యాణసంధానులై
శ్రీరంజిల్లఁగ నెల్లకాలము సుఖ ♦ శ్రీలన్ వెలార్పన్ దగున్.

బృహ:- దేవేంద్రా! సర్వమును అనుకూలముగా జరిగినది ఇం
కను నీకేమి ప్రియము గావలయును?

దేవేం:- ఈ దంపతు లన్యోన్యానురాగముచేఁ జిరకాలము
వర్ధిల్లుదురుగాక! మఱియును

మంగళంమహాశ్రీవృత్తము.

మానమును బూని యభి ♦ మానమును మానవులు ♦ మాన్యత వహించి
ముద మొందన్
హీనపదవర్తన నవిహీనలయి భామినుల ♦ హీనసుచరిత్రత మెలంగన్
వాన లిల సస్యముల♦వర్ధిలగఁజేయు భగ♦వంతుఁడు దయామతినొసంగున్
మానక శుభంబు లస ♦ మానమహిమంబు జయ ♦ మంగళమహాశ్రీన్.

బృహ:- తథాస్తు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్యము:- ఇది శ్రీమదాళైలలీషాగురు ప్రసాలబ్ధకవితావిశేష మదీన్
కబీర్ గురువంశ సంజాత మొహిద్దీన్ బాద్‌షా గురుజ్యేష్ఠ
పుత్త్రకన్నంషావల్యగ్రజన్మ ఉమ్మేరలీషా కవివిరచితంబైన
మణిమాలానామనాటకము సర్వమును షష్ఠాంకము
సంపూర్ణము.